# హేతువాదం : స్త్రీలు నెం. 10



మల్లాది పబ్లికేషన్సు
ప్రతులు 1000
ఆగస్టు 1988

రచయిత : మల్లాది సుబ్బమ్మ

సర్వహక్కులు రచయితవి

ప్రచురణ :

మల్లాది పబ్లికేషన్సు
[illegible] కాలనీ
మెహిదీపట్నం హైదరాబాదు-500028

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :
వికాసం
[illegible] కాలనీ
మెహిదీ పట్నం
హైదరాబాద్-500 028

ఫోన్: 354[illegible]9

వెల రూ. 5-00

ముద్రణ : సంపత్ ప్రింటర్స్, నల్లకుంట, హైదరాబాద్

ఆ మహిళా సంఘ నాయకులు కూడా మత దృష్టి కలవారేమో! లేక మత మౌఢ్యంలో మునిగిన వారేమో!

ఇక సమానత్వం సంగతి సరే సరి. భార్యాభర్తలు సమానమే కాని, ఆమె వంట చెయ్యాలి, పిల్లల్ని పెంచాలి; దానికి ఆమెయే తగును. ఆమెకు ఓర్పు, నేర్పు వున్నదని చెప్పి పబ్బం గడుపుకుంటారు. ఇది ప్రచ్ఛన్నమైన మోసం. సంతానాన్ని స్త్రీ మాత్రమే కనగలదని, స్త్రీ పురుషులిద్దరూ శిశువుల్ని పెంచగల సమర్థులు అని మరచిపోరాదు. తప్పుడు మాటలు చెప్పి, కుంటిసాకులు చెప్పి, నంగనాచి మాటలు పలుకుతూ స్త్రీని అసమానత్వ దృష్టితో చూడటం, ఆత్మవంచన, పరవంచన కూడా. పై చెప్పిన పైఖరులను వ్యాపారీత్యా, ఎత్తుగడల రీత్యా అనుసరిస్తున్నారు మతస్థులు. కాని కొంతమంది నిరీశ్వరవాదులు సైతం అమాయకంగా యిలాంటి పొరపాటు వైఖరిని నోటి మాటతో కాని, చేతలతో కాని సమర్థించటం శోచనీయం. ఇక్కడ ఒక పరిశీలన అవసరం. తమ చిత్తవృత్తిని, తమ నడవడిని సమీక్షించుకోవటం అవసరం. స్త్రీ పురుషులందరూ దేవుని బిడ్డలనుకుంటే, ఉపాధిలో వున్న జీవాత్మ, పరమాత్మకు భిన్నం కాదనుకుంటే మనుష్యులందరూ సమానులే. స్త్రీ పురుషులు కూడా సమానులే. అలాకాక శాస్త్రీయ దృక్పథంతో ఆలోచిస్తే ప్రతి మనిషిలో హేతుత్వం వున్నది కనుక మానవులందరూ స్త్రీ పురుషులందరూ సమానులే. ఆస్తికులయినా, నాస్తికులయినా ఈ సత్యాన్ని విస్మరించటానికి వీలులేదు. అలాంటప్పుడు మానవ వ్యక్తి నిరంతరం ఆశించే స్వేచ్ఛను కాదనడానికి మనం ఎవరం? స్త్రీలకు స్వేచ్ఛా సమానత్వాలను అందించలేని సమాజం యొక్క వికాసం కుంటుపడుతుంది. సమాజంలో సగం మంది స్త్రీలు తక్కువ స్థాయి మానసిక జీవితం సాగిస్తున్నప్పుడు వారు ప్రగతికి ప్రతిబంధకాలుగా తయారవుతారు. పురుషాభ్యుదయం కూడా కుంటుపడుతుంది. "నేను వరకట్నాలకు వ్యతిరేకినే కాని, మా ఆవిడని కాదనవేక అడుగుతున్నాను" అంటాడొక అభ్యుదయ పురుషుడు. నేను స్త్రీ విద్యకు అనుకూలుణ్ణే కాని మా ఆవిడ పోరు పడలేక మా అమ్మాయి చదువు మాన్పించాను అంటాడొక విప్లవ వీరుడు. ఏమయింది వీరి పురోగామి తత్వం? ఏ స్త్రీలనయితే వీరు అజ్ఞానంలో వుంచుతున్నారో ఆ స్త్రీల అజ్ఞానమే వారిని బలిగొంటున్నది. తాము త్రవ్వుకున్న గోతిలో తామే పడుతున్నారు. ఇది విజ్ఞత కాదు; వివేకమనిపించుకోదు. సాధ్యమయినంతవరకు తలచే దానికి, చెప్పేదానికి, చేసేదానికి పొంతన వుండాలి. ఆస్తికులయినా, నాస్తికులయినా, మతస్థులయినా, హేతువాదులయినా చిత్తశుద్ధితో స్త్రీల విషయమై సంచరించిన నాడు ఈ దేశం పురోగమిస్తుంది.

"పడుతుంది". అంటే ఇంటి వెలుపల ఆమె నడయాడటానికి కూడ వీలులేదు. గ్రామాల్లో "చదువు చార్లే" అని ఆపుతారు. అమ్మాయికి కనీసం కుటుంబ విషయాల్లో కూడా, ముఖ్యమైన వాటిల్లో ఆమె ప్రమేయం వుండదు. పొలం కొనడం, స్థలం సంపాదించటం, ఇల్లు కట్టడం, ఆడపిల్లకు చదువు చెప్పించడం, ఇలాంటి వాటిల్లో కూడ ఆమె మాటకు విలువలేదు. చివరకు ఎంతమంది సంతానాన్ని కనాలో, భర్త తేల్చాలి. ఆమె సంతాన నిరోధ ఆపరేషన్ చేయించుకోవాలన్నా అతడు నిర్ణయించాలి. ఇలా శారీరక, కౌటుంబిక, సామాజిక విషయాలలోనే కాక ఆర్థిక, రాజకీయ విషయాలలో కూడ ఆమెకు స్వేచ్ఛ లేదు. ఆమె కష్టపడి తెచ్చే కూలి, వేతనం, జీతం ఆమెకు చెందవు. వివాహిత స్త్రీని ఓటు కూడ ఎవరూ అడగరు. ఫలానావారి భార్యగాను, లేక ఫలానావారి కూతురుగానూ, రాజకీయ రంగ ప్రవేశం చేయాలే తప్ప ఆమెను పైకి రానివ్వరు. ఇలా చెప్పాలంటే సవాలక్ష సమస్యలున్నాయి. ఇన్నింటికీ మూలం మతమేనని మనం నిరూపించవచ్చు. కనుక మత తత్వాన్ని ఎంత త్వరగా ఛేదిస్తే అంత త్వరగా మనలో రాక్షసత్వం పోయి మానవత్వం సిద్ధిస్తుంది; స్త్రీ జనాభ్యుదయం, పురుష విముక్తి సిద్ధిస్తుంది. మరి హేతువాదం స్త్రీలకు ఎందుకు కావాలో ఆలోచిస్తారా?

# కుహనా వైజ్ఞానికులు: సామాజిక రుగ్మతులు

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూను ఆధునిక భారత నిర్మాతగా కొంతమంది పేర్కొంటారు. విజ్ఞానానికి ప్రాధాన్యత నివ్వటానికి ఆయన ప్రయత్నించాడనటంలో సందేహం లేదు. ఆ సందర్భంలోనే మన దేశంలో నెహ్రూ కేంద్రాలు అనేక చోట్ల వెలిశాయి. శాస్త్రీయ దృక్పథం యొక్క ఆవశ్యకతను గురించి ఆ కేంద్రాలు నొక్కిపెట్టి ప్రచారం చేశాయి. శాస్త్రీయ దృక్పథం అలవర్చుకోవటం పౌరుల కర్తవ్య మన రాజ్యాంగంలో కూడా అధికరణమూ 51 ఎ లో మౌలికవిధులుగా శాస్త్రీయ భావనను, మానవవాదాన్ని, సత్యాన్వేషణ సక్తిని, సంస్కరణ భావాలను అలవర్చుకోవాలని పేర్కొన్నారు. శాస్త్రీయ దృక్పథమా, సంప్రదాయాల దాస్యమా, అనే పేరుతో చర్చ కూడా సాగింది. అనేక మంది విజ్ఞాన శాస్త్రవేత్తలు తమ అభిప్రాయాలను చెప్పక తప్పలేదు. శాస్త్రీయ దృక్పథం అవసరం లేదని ఎవరూ అనకపోయినా దానికి, మతానికి లేక దైవభావనకూ వున్న సంబంధాలను వివరించడంలో భిన్నాభిప్రాయాలు ప్రకటితమయినాయి. అలా ఆనాటికీ ఈనాటికీ శాస్త్రీయ దృక్పథం శోభించటానికి కారణా

లనేకం వున్నాయి. అంతేకాదు, సైన్సును నమ్మినవారిలోనూ, నమ్మనివారిలోనూ,
కూడా భిన్నాభి ప్రాయాలు చాలా వున్నాయి. వితండ వాదాలనేకంగా వున్నాయి.

మతాన్ని, సైన్సునూ కలిపి రెండూ ప్రక్క-ప్రక్కనే సహవాసం చెయ్యవచ్చునే
వాదన ఒకటి ప్రబలంగా ప్రచారంలో వుంది. రెండోది. మతం, విజ్ఞానం రెండూ
మానవాళికి నష్టం చేకూర్చాయి. కనుక రెంటి మేళవింపుతో కూడిన శాస్త్రీయ మతం
కావాలనేవారు ఒకవర్గంగా తయారయ్యారు. అంటే నింద్యమైన మతమూ—మూఢాచారా
లలో పిడివాదాలలో వున్న మతం-ఒక వైపున. నింద్యమైన విజ్ఞానం-అణుబాంబులు,
మారణాయుధాలు తయారుచేసిన విజ్ఞానం-మరోవైపున వున్నాయి. ఈ రెంటి మంచిని
కలిపి దానిని శాస్త్రీయమతంగా [సైన్సుపై ఆధారపడే మతాన్ని] నిర్మించి ఇటు
మతంలో మంచిని అటు సైన్సులో మంచిని కలిపి నూతన విధానంలో జీవితాన్ని
మలుచు కోవాలనే శాస్త్రజ్ఞులు కొందరొచ్చారు. ఇక మూడో పద్ధతి వాదనొకటి హెచ్చు
స్థాయిల్లోనే అమల్లోవుంది. మనిషిలో అద్భుత దృశ్యాలమీద, విషయాలమీద ఆసక్తి
వుంటుంది. దానివల్ల సత్యాన్వేషణ ఉద్భవిస్తుంది; అది సృజనాత్మకతకు దారితీస్తుంది.
భావుకత, సృజనాత్మకత మనిషియొక్క ఆధ్యాత్మికతకు నిదర్శనాలు. విజ్ఞానం కేవలం
భౌతిక ప్రపంచానికి సంబంధించినది. విజ్ఞానాన్ని అంగీకరించనంత మాత్రాన ఆధ్యా
త్మికతను నిరసించనక్కరలేదు. ఇతరులకు నష్టంలేని ధ్యానము, గురుపూజ, దైవ
ప్రార్థనలను మనం నిరసించ నక్కర్లేదు. అనేది మరోవర్గపు భావన వుంది.

ఇకపోతే మరోరకపు పురాతనవాదం వుంది. మతానికి, సైన్సుకు వైరుధ్యం
వుందనేదే ఆ సిద్ధాంతం. వాటి అంతగా లేక పోయినా దాని ప్రభావం పైవాదనలకు తీసి
పోదు. ఈ సిద్ధాంత ఈ విభిన్న వాదాలతో అనంతంగా పోరాడుతూ తన విశిష్టతను
నిలుపుకొంటున్నది. అదే భౌతికవాదం లేక హేతువాదం. ఇది ఇతర వాదాలన్నింటిని
నిరసిస్తూ తర్కానికి అనుభవానికి విలువనిస్తుంది. పైవాదాలన్నీ స్వర్గము నరకము అనే
భయంకర, నమ్మశక్యంకాని అతీత భావాలమీద ఆధారపడి వుంటాయి. కాని హేతు
వాదం మాత్రం కేవలం నైతిక సిద్ధాంత ప్రాతిపదికపై ఆధారపడి వుంటుంది. రాజ
కీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక అంశాలన్నీ మానవ ప్రయత్నం మీదనే ఆధార
పడి వుంటాయని ఉద్ఘాటిస్తుంది. శాస్త్రీయ విజ్ఞానం, తార్కిక లక్షణం, సత్యాన్వేషణలతో
కూడిన జీవిత విధానమే దాని లక్ష్యం. వైజ్ఞానిక విశ్లేషణద్వారా మాత్రమే మతశక్తులను
మూఢ, విశ్వాసాలను ఛేదించగలమని, ప్రకృతిపై ఆధిపత్యం వహించగలమనే విశ్వా
సం హేతువాదులకు మాత్రమే వుంటుంది. తమ భవిష్యత్తుకు తామే కారకులమని

నమ్ముతారు. గ్రుడ్డిగా దేనిని నమ్మరు, ఏ సిద్ధాంతానికి చరమదశవుండదని, ఏ ఒక్కరూ చివరి సిద్ధాంతకర్తలు కారని నమ్ముతారు. మతపరమైన విశ్వాసాలు, నమ్మకాల వల్ల సంప్రదాయాలు మరింత బలపడతాయని తద్వారా సామాజిక పతనం వస్తుందనీ వాదిస్తారు.

మతంలో ప్రయోజనకరమైన లక్షణాలు, నష్టదాయకమైన లక్షణాలూ రెండూ వున్నాయి. ప్రయోజనం అంటే నీతిమీదనొక్కు. మతం సామాజిక జీవితాన్ని ప్రభావితం చేయబూనినప్పుడు నీతియొక్క ఒక దృక్పథాన్ని విధిగా అనుసరించకతప్పదు. నీతి మానవ నడవడికకు సంబంధించిన విషయం. ఒకవ్యక్తి మరియొక వ్యక్తితోగాని, పలువురు వ్యక్తులతోగాని సంబంధం కలిగి ప్రవర్తించవలసి వుంటుంది. ఈ సందర్భంలోనే మంచిచెడ్డలు, యుక్తాయుక్తాలు అవశ్యమౌతాయి. నీతివంతమైన జీవితాన్ని గడపవద్దని ఎవిరూ అనరు. కాగా దేవునిపేర చెప్పబడ్డ నీతి మతనీతి అవుతుంది. దేవుడు చెప్పాడని, లేక ప్రకటించాడని, లేక స్ఫురింపజేశాడని, లేక అవతారాల ద్వారా పలికాడని నీతివ్యాక్యాలను ఉటంకిస్తారు మతవాదులు. నిజానికి ఆయా కాలమాన పరిస్థితులను బట్టి సామాజిక స్థితిగతులను బట్టి తమకు తోచినవి చెప్పడం జరిగింది. నిజంగా దేవుడు తమకు చెప్పాడని, లేక మనస్సులో మెదిలేలా చేశాడని వారు నమ్మి వుండవచ్చు. ఇదంతా భ్రమ సంజాతం. అలాకాక తాము చెపితే సమాజం విలువ ఇవ్వదని భయపడి దేవుని పేరుతో ప్రకటించి వుండవచ్చును. ఏదయినా ఈ నీతి వాక్యాలు చివరకు మానవ ప్రతిపాదితాలే. సహజంగా వారి వారి కాలాలు, వారి మెట్టిన ప్రాంతాలు వేరు వేరు కావటంతో వారి దృక్పథాలలో మార్పులు, వారి మాటలలో తేడాలు కనిపిస్తాయి. ఇవన్ని వారి శిష్యులకు వారివారసులకు అందేటప్పటికి పిడివాదాలుగా మారి "మా దేవుడు గొప్పంటే మా దేవుడు గొప్పని, మా గురువు మహాపురుషుడు మా మతం ఉత్కృష్టమని తగువులాటలు ప్రారంభమై కొట్లాటలు, సంఘర్షణలు, మత యుద్ధాలు జరగటం చరిత్ర చెప్పిన సత్యం, మనకు తెలిసిన నిజం. మతం లేకుండానే నీతి వుండవచ్చు అనే భావం ఈ కోవకు చెందిన వారికి స్ఫురించక పోవడం వల్ల ఇంతవరకు మతంవల్ల జరిగిన కష్టనష్టాలను వారు విస్మరించి మతంయొక్క నైతిక ప్రాతిపదికనే వారు చెప్తున్నారు. నిజానికి దేశ కాల ప్రాంతాలనుబట్టి నీతియొక్క స్వరూపం మారుతుంది. కాని మతప్రేరితమైన నీతివిషయంగా అలాంటి అవకాశాలు లేవు. అది ఒకేసారి ప్రకటితమయింది. అది ఋషిప్రోక్తము, ప్రవక్తచే ప్రకటితము, అది సర్వకాలాలకు వర్తిస్తుంది, దానికి మార్పులేదు, ఉండదు. వుండరాదు. ఈ

అంశాన్ని గమనిస్తే మతనీతియొక్క లోప భూయిష్టత మనకు దర్శనమిస్తుంది. కనుక మతాన్ని ఏ విధంగాను, ఆదరించటానికి పోషించచటానికి అవకాశం లేదు.

ఇక రెండవ ఆలోచనాక్రమాన్ని విశ్లేషణ చేద్దాం. ఇందులో మత మౌఢ్యాన్ని, విజ్ఞానశాస్త్రాన్ని రెంటినీ నిరసించటం జరిగింది, విజ్ఞానానికి సాంకేతికతకు భేదాను గ్రహించలేనందువల్ల ఈ గందరగోళం ఆవిర్భవిస్తుంది. అణువులో బ్రహ్మాండమైనశక్తి ఇమిడి ఉన్నదని కనుగొన్న వైజ్ఞానికుడు నింద్యుడు కాడు. ఈ జ్ఞానాన్ని వాడి మారణాయుధాలను, అణుబాంబులను తయారుచేయించి, ఇతర దేశస్తులపై ప్రయోగించే రాజకీయ వాది నిజంగా దుర్మార్గుడు, దుష్టుడు కూడా, అతన్ని వదలిపెట్టి విజ్ఞానాన్ని నిందించడం అవివేకం. మతమౌఢ్యాన్ని నిరసించడం సబబే. కాని ఏదో పక్షపాత రహితంగా ప్రవర్తిస్తున్నట్లు భావించుకొని ఇటు విజ్ఞానాన్ని అటు మతాన్ని రెంటినీ ఒక గాట కట్టివేయటం అనుచితం.

సృష్టికర్త యొక్క ఉనికిని అంగీకరించేది మతం. మనషిని దేవునికి మోకరిల్ల చేసేది మతం. అతనిలో దాస్యభావాన్ని అది నెలకొల్పుతుంది. అతడు ఆత్మస్థయిర్యాన్ని కోల్పోతాడు. అతనిలో ఆత్మవిశ్వాసం కొరబడుతుంది. స్వయం వ్యక్తీకరణకు అవకాశం వుండదు. కనుక అలాంటి దేవుని వునికిపై ఆధారపడి ఉన్న మతాన్ని ఏరకంగాను ఆమోదించము. ఎన్ని గుణగణాలు మత భావనకు ఆపాదించినా, అలంకారాలు దానికి తొడిగినా మతంయొక్క అసలు స్వభావం మారదు కనుక "శాస్త్రీయ మతం" అనేభావం గందరగోళంలో, అయోమయంలో జనించిందని చెప్పక తప్పదు.

మూడవ అభిప్రాయాన్ని అవలోకన చేద్దాం. మనిషిలో బుద్ధి, ఉద్వేగము రెండూ వున్నాయనేది వాస్తవం. ఉద్వేగంలేని మనిషి కేవలం యంత్రమవుతాడు. క్రోధం, శోకం, వాత్సల్యం, పశుపక్ష్యాదుల్లోను కనపడతాయి. కాకపోతే మనిషిలో బుద్ధి కుశలత మెండు. హేతుత్వశక్తి మానవ వ్యక్తిలో బాగా వికసించింది. సముద్రం యొక్క గంభీరత, మబ్బుల రంగులు, మెరపు కాంతి, ఉరుముల ధ్వని, పర్వతాల ఔన్నత్యం సెలఏళ్ళ దుందుడుకు నృత్యాలు, నదీప్రవాహాల వేగము ఇవన్నీ మనిషిలో విస్మయభావాన్ని కలిస్తాయి. ప్రకృతిలో భాగమైన మానవుడు తతిమ్మా ప్రకృతిని చూచి పరవశిస్తాడు. ఇది అతని నైజ ప్రవృత్తి. నవరసాలలో ఒకటైన అద్భుతం మనిషిని ఆకట్టుకుంటుంది. అందుచేతనే అతనిలో సత్యాన్వేషణా, సృజనాత్మకత చోటు చేసుకుంటాయి. సముద్రపు లోతులను లెక్క కడతాడు. హిమాలయ శిఖరా

లను అధిరోహించాలని ఆశిస్తాడు. సాహసయుతమైన కార్యాలను అతడు చేపడతాడు. మబ్బుల రంగులను చిత్రిస్తాడు. పక్షుల కిలకిలా రావాలను విని అంతకు మించిన లయ ప్రధానమైన నాదాలను సృష్టిస్తాడు. కళాపిపాసి అవుతాడు. కళలను జీవితంలో రంగ రించుకుంటాడు. మానవ నాగరికత తొలి దశల్లో ప్రకృతికి మూలాధారంగా మనిషి దేవుని ఊహించుకున్నాడు; అతని వునికిని భావన చేశాడు. విజ్ఞానం పెరిగిన కొద్దీ మానవుని ఆలోచనా ధోరణి సాగిన కొలదీ ఆ వూహాధారమైన భావన అనావశ్యక మయింది. అయితే అలవాటుగా దేవుని ప్రార్థిస్తూ, పూజిస్తూ మననం చేస్తున్న మాన వుడు "అతడు లేడు" అనే భావనను సహించలేకపోయినాడు. ప్రేమతో పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రులు చనిపోతే వారు మరో లోకంలో వున్నారని వూహించుకొని వారికి భోజన వసతులు కల్పించటానికి శ్రాద్ధాదులు చేసినట్లే "దైవ ధ్యానం" సాగించడం జరుగుతోంది. దైవభక్తి, గురుపూజ లాంటివి వున్నంత మాత్రాన విజ్ఞాన జీవితానికి నష్టంలేదు, మనిషికి అవి ఆత్మసంతృప్తినిస్తాయి, అని చెప్పటం బాల్యావస్థలోని భావాలను సాగించడమే. తృప్తి ఇస్తాయని మాదక ద్రవ్యాలను వాడితే కలిగే నష్టమే ఈ వైఖరి వల్ల కలుగుతుంది. దైవ భావనకు వ్యతిరేకంగా చెప్పే వాదనలను సక్రమంగా పరిశీలిస్తే ఇలాంటి అభిప్రాయాలకు తావు లేదు. గురుపూజా విధానాన్ని విశ్లేషణ చేస్తే శిష్యుడు గురువును సర్వస్వంగా భావిస్తాడని తెలుస్తుంది. "గురుర్విష్ణు గురుర్బ్రహ్మ, గురుదేవో మహేశ్వరః" అనే శ్లోకం, "తను, ధన, మనః ప్రాణాలను గురువుకు అర్పించాలి" అనేసూక్తి ఈ అంశాన్ని విశదీకరిస్తుంది. ఆత్మన్యూనతా భావాన్ని, వ్యక్తిత్వ వినాశనాన్ని ఫలితాలుగా ప్రసాదించే దైవ భావన, గురుపూజ లాంటి అభిప్రాయాలు మానవుని బుద్ధికుశలతకు అవమానకరాలు. కనుక ఇవి విజ్ఞా నంతో సహజీవనం చేయలేవు.

పై వైఖరులను తృణీకరించినప్పుడు సరియైన దృక్పథం కోసం ప్రయత్నించ వలసి వుంటుంది. మతం యొక్క, విజ్ఞానం యొక్క మౌలిక తత్వాలను గ్రహిస్తే మతానికి విజ్ఞానానికి చుక్కెదురని తెలుస్తుంది.

మతం విశ్వాసంమీద ఆధారపడుతుంది. మత ప్రతిపాదిక విషయాలను రుజువు చెయ్యలేము. అందువల్లే వాటికవే సత్యాలుగా చలామణి అవుతాయి. వాటికి రుజువు కోరరాదు అంటారు. అలా పుట్టిందే ఈశ్వర భావన. ఒకసారి లేనిదానిని ఊహించుకొని నమ్మిన తరువాత తతిమ్మా తంతు అంతా, లేక ఆలోచనా క్రమమంతా దానినుండే

ఉద్భవిస్తుంది. ప్రకృతికి మూలమైన శక్తి ప్రకృతికి వెలుపల వున్నదని తలిస్తే ఆ శక్తిని ధ్యానించడం, ప్రార్థించడం, పూజించడం, తృప్తిపరచడం తప్పనిసరి అవుతుంది. వాటికి క్రతువులు, వ్రతాలు వెలుస్తాయి. వాటిని జరిపించటానికి పురోహితులు పుట్టుకొస్తారు. వారు గురువులుగా రూపొందుతారు; ఋషులుగా తయారవుతారు. సమాజానికి అవసరమైన నీతి వాక్యాలను దేవుని పేర పలుకుతారు. ఇవి మత నీతి శాస్త్రాలుగా చలామణి లోనికి వస్తాయి. వీటి మధ్య సమన్వయం వుండదు. దాంతో మతసమాజాలు సంఘర్షణకు దిగుతాయి. మానవాళి చీలిపోతుంది. జననాశనం సంభవిస్తుంది. ఇదంతా అప్రతిహతంగా జరిగిపొయ్యే మత భావనా ఫలితం యొక్క పరిణామం.

సైన్సు ప్రకృతి రహస్యాలను కనుగొనటానికి పుట్టింది. ప్రకృతిలోని కార్య కారణ సంబంధాలను గుర్తించింది. మానవ మస్తిష్కంలోని ఆలోచనలను పసిగట్టింది. భౌతిక రసాయన శాస్త్రాలు, జీవ శారీరక శాస్త్రాలు, మానసిక శాస్త్రాలు ఇవన్నీ విజ్ఞాన పరిధిలోకి వస్తాయి. వీటి ఫలితంగా మానవాళి పూర్వం కన్నా ఈనాడు సుఖమయ జీవితం గడుపుతున్నది. కాగా భౌతికశాస్త్రాల పురోగమనపు వేగాన్ని మానసిక శాస్త్రం అందుకోలేక పోతున్నది. మానవాళి అంతా ఒకటే, స్వేచ్ఛా సమానత్వ సౌభ్రాతృత్వాలు మానవ జీవితంలో వెల్లివిరియాలని అందరూ అంగీకరించినా ఆచరణలో వడిదుడుకులు సంభవిస్తున్నాయి. అందువల్ల మానవ సంస్కృతీ చరిత్ర కుంటుపడుతోంది. మానవ కళ్యాణాన్ని, సంక్షేమాన్ని ఒనగూర్చే తాత్విక చింతన అవసరమౌతుంది. కాని ఆ తత్వశాస్త్రం విధిగా విజ్ఞానాన్ని ఆధారం చేసుకొని వుండాలి. అప్పుడే దానికి నిత్యత్వం ఒనగూడుతుంది. మత భావన వైజ్ఞానిక భావనకు పూర్తిగా విరుద్ధం కనుక దాన్ని తృణీకరించడంలో ఏ విధమైన సంకోచమూ పనికిరాదు.

విజ్ఞాన శాస్త్రాన్ని కాదనకుండానే, శాస్త్రీయ దృష్టిని నిరసించకుండానే వాటి సరసన కొందరు మతాన్ని నెలకొల్ప ప్రయత్నిస్తున్నారు. మరికొందరు అటు మతాన్ని, ఇటు విజ్ఞానాన్ని విమర్శిస్తూ శాస్త్రీయ మతం కావాలని ప్రతిపాదిస్తున్నారు. దైవ భావన, గురుపూజ కేవలం వ్యక్తిగతమైనవని, ఆత్మసంతృప్తికరాలని చెపుతూ వాటిని సామాజిక జీవితంలో దొడ్డి దోవన ప్రవేశపెడుతున్నారు. పై మూడు వర్గాలకు చెందిన విజ్ఞాన శాస్త్రవేత్తలు ఏదో రూపంగా మతం యొక్క అస్తిత్వాన్ని సమర్థించ ప్రయత్నించేవారే. వీరు విజ్ఞాన శాస్త్రాన్ని అధ్యయనం చేస్తున్నా, అనుసరిస్తున్నా వైజ్ఞానిక దృక్పధం లేనివారని, శాస్త్రీయ దృక్పధం వంటపట్టించుకోనివారని తేలుతుంది ఈ కుహనా వైజ్ఞానిక వ్యూహాలను, ఎత్తుగడలను, ఆలోచనా ధోరణులను, అభి

ప్రాయాలను ఒక కంట కనిపెట్టి హేతువాద సిద్ధాంతం ఎందుకు అత్యావసరమయిందో, దాని వల్ల సమాజానికి, వ్యక్తికి ఎలాంటి ఔన్నత్యం సిద్ధిస్తుందో ప్రచారం చేయటం భౌతికవాదుల కర్తవ్యం. హేతువాది ముఖ్యంగా నీతివాదానికి కట్టుబడతాడని, నీతి వాదులు మోసం చేయరంటే, అసత్యమాడరంటే మానవ విలువలను గౌరవిస్తారంటే ఏ ప్రవక్తో, రాముడో, క్రీస్తో చెప్పారని చెయ్యరు అని మానసిక పరివర్తన వల్ల చేస్తారని రుజువులతో సహా వెలికితేవాలి. ప్రతి శాస్త్రీయ వాది, హేతువాది తమ చిత్తశుద్ధి ద్వారా, ఆచరణ ద్వారా మాత్రమే సిద్ధాంతాన్ని అమలుపరుస్తారు. అలాగే తమ భవిష్యత్తుకు తామే బాధ్యత వహిస్తారు. ఇతర మతాలను మత ద్వేషంతో కాక సిద్ధాంత పరమైన లక్షణాలకు భాష్యాలు చెప్పి వాటి వల్ల మానవ విలువలకు ఎలాంటి ప్రయోజనమో ఉదాహరణలతో చెప్తారే గాని వ్యక్తిగత దూషణ, మత దూషణలకు తావు ఇవ్వరు. ఈ లక్షణాలను మనం బోధించక పోతే కుహనా శాస్త్రజ్ఞులు సమాజాన్ని సర్వనాశనం చేసే ప్రమాదం లేక పోలేదు.

# 1979 వరకు ఆం. ప్రదేశ్‌లో హేతువాద ఉద్యమ చరిత్ర

## (ఒక దృక్పథం)

ఎం. వి. ఆర్.

భారత హేతువాద ఉద్యమం 1930లో బొంబాయిలో ప్రారంభమయి ట్లు చెప్పవచ్చు. ఆనాడు 'పురోహితపక్ష వ్యతిరేక సంస్థ' ఒకటి ఉద్భవిం ంది. ఆ సంస్థ తరఫున 'హేతుత్వం' (Reason) అనే పత్రిక ప్రకటిం వారు. ఎంతో హేతువాద సాహిత్యాన్ని ప్రచురించడం, సేకరించడం జరి ంది. ప్రముఖ పత్రికా రచయిత బి. జి. హార్నిమను, పరంజిపే సాలమన్ ప్రభృతులు దానికి సారథ్యం వహించారు. ఆ సంస్థ ఒక గ్రంథాలయాన్ని ంత ధనాన్ని సమకూర్చుకున్నది.

1937 నుండి 1947 వరకు కాంగ్రెసు లోని వామపక్ష శక్తులు చురుకుగా పనిచేశాయి, ఆ సందర్భంగా ఎం, ఎన్. రాయ్ అనుయాయులు సహచరులు త్రిపురనేని గోపీచంద్‌గారి నాయకత్వాన జి. కె. కృష్ణారావు, పి. వి. సుబ్బారావు, కోగంటి రాధాకృష్ణమూర్తి, విశాఖలో అబ్బూరి రామకృష్ణారావు గారు, ర్యాడికల్ డెమోక్రటిక్ పార్టీ నాయకులు కార్యకర్తలు, కొంత మంది సోషలిస్టులు హేతువాద ఉద్యమానికి ప్రత్యక్షంగాను పరోక్షంగాను తోడ్పడ్డారు. ఎం. ఎన్. రాయ్ రచించిన పుస్తకాలు ఉపకరించాయి. అచ్యుతమాంబగారి నాయకత్వాన మహిళోద్యమం ఎంతో బలవత్తరంగా నడిచి హేతువాద దృక్పథాన్ని వ్యాప్తి చేసింది. గోపీచంద్‌గారి రచనలు నాస్తిక ప్రచారానికి ఉద్దేశించబడినా మూఢ విశ్వాస నిర్మూలనకి బలం చేకూర్చాయి.

1949లో ఆత్మగౌరవ ఉద్యమస్థాపకులు (self-respect movement) ఎన్. రామనాథన్ పూనిక తో భారత హేతువాద సంఘం మద్రాసులో నెలకొల్పబడింది. ఎం. ఎన్ రాయ్, ఎ.జి.కే. (ఆవుల గోపాల కృష్ణమూర్తి), జోసఫ్, పరంజపె, ఘోష్, లోటవాలా, సాల్మన్, గోరా ప్రభృతులు స్థాపక సభ్యులు. ఈ ఉద్యమంలో మొదటి నుండి రాడికల్ హ్యూమనిస్టులు యథోచిత పాత్ర నిర్వహిస్తూవచ్చారు.

భారత హేతువాద సంఘం అధ్యక్షులుగా 1958 నుండి 1965 వరకు ఆచార్య ఆర్. ఎస్. యాదవ్ వ్యవహరించారు.

ఉపాధ్యక్షులుగా 1949-55 లో ఎం. ఎన్. రాయ్, 1955-58 ప్రేమనాథ్ బజాజ్ 1955-58లో ఆచార్య యాదవ్, 1955-57 మరియు 1958-69 లలో ఎలెన్ రాయ్, 1955-66 లలో ఆవుల గోపాలకృష్ణమూర్తి (ఎ. జి కే) 1967-71 లో ఆవుల సాంబశివరావు గారలు ఉన్నారు. కార్యదర్శిగా సి. ఆర్.ఎం. రావు (1953-57), ఎం. ఎ. రావే (1957-58), ఆవుల సాంబశివరావు (1965-67). ఎస్. కె. ఆచార్య (1957-71) గారలు పనిచేశారు.

తెనాలిలో అఖిల భారత మహాసభను నిర్వహించారు ఎ. జి. కె (ఆవుల గోపాలకృష్ణమూర్తి). హైదరాబాద్‌లో 1965 లో జరిగిన మహాసభకు ఆవుల సాంబశివరావు గారు నిర్వాహకులు. అపుడు వారు ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. 1967 నుండి 1971 వరకు ఎస్. కె ఆచార్య (హైదరాబాద్) సంపాదకత్వాన హైదరాబాదు నుండి రామనాథన్ గారిచే స్థాపింపబడిన 'ఇండియన్ రేషనలిస్టు' పత్రిక నడుపబడింది ఎన్. ఇన్నయ్య నాలుగు సంవత్సరాలు కోశాధికారిగా పనిచేశారు (1967-70). 1974 నుండి 1980 వరకు ఎం. వి. రామమూర్తి ఉపాధ్యక్షులుగా ఉండి 1980 డిసెంబరులో ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

గోరా గారు 1972-1974 సంవత్సరాలలో భారత సంఘ అధ్యక్షులుగా వ్యవహరించారు. 1978 లో ఆం. ప్ర. హేతువాద సంఘం స్థాపించబడింది. లవణం గారు అధ్యక్షులుగాను, బి వేణుగోపాల్ (రేపల్లె) కోశాధికారి గాను

ఏర్పడింది. 1971 లో జ్యోతిశంకర్, ఎ. సూర్యనారాయణ గారలు భారత సంఘ బాధ్యతను స్వీకరించి 'ఫ్రీథాట్' అనే ఇంగ్లీషు పత్రికను ప్రకటించసాగారు. ఆ పత్రికను 1980 మధ్య కాలం వరకు ఎ. సూర్యనారాయణ గారు, వసుంధ్ర గారు, సి. ఎ. శేషగిరిగారు పూనికతో నిర్వహించారు.

ఎ. సూర్యనారాయణ గారు తెలుగువారు. వారు ఆం. ప్ర. హేతువాద సంఘ నిర్మాణంలో, ఉద్యమ వ్యాప్తి విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించారు. వసుంధ్ర గారు వారికి చేదోడు వాదోడుగా ఉండి ఉద్యమ వ్యాప్తికి తోడ్పడ్డారు. వారిరువురి కృషి ఫలిత గానే శ్రీ లంక హేతువాద సంఘాధ్యక్షులు ఎ. టి. కోవూరు గారు భారతదేశ పర్యటనకు పూనుకోవడం జరిగింది. వారు మూడు పర్యాయాలు 1975-1976 లో భారత దేశంలోని ముఖ్యమైన పట్టణాలలో పర్యటించారు. కేరళ, ఆంధ్రప్రదేశ్, తమిళనాడులలో విస్తృతంగా పర్యటించారు. 1975 లో ఎమ్. వి. రామమూర్తి, వి. వేణుగోపాలరావుల పూనికతో చీరాల, విజయవాడ, వరంగల్, హైదరాబాద్‌లలో కోవూరు ఉపన్యాసాలు, స్వామినాధన్ మేజిక్, ప్రొఫెసర్ హిప్నో యొక్క హిప్నోటిజం ప్రదర్శనలు జరిగాయి. చీరాలలో సి. హెచ్. రాజారెడ్డి, బస్సు వెంకటేశ్వర్లు ప్రభృతులు, విజయవాడలో బి. రామకృష్ణగారు, హైదరాబాద్‌లో భాస్కరశర్మ, డి. జి. రామారావు, రాజు గార్లు ఎంతో సహాయం చేశారు. మరల 1975 లో కోవూరు పర్యటన చేసినపుడు తోటకూర వేంకటేశ్వర్లు, మల్లాది సుబ్బమ్మ తదితరులు ఏర్పాట్లు చేసినవారిలో ఉన్నారు. 1976 లో పర్యటన జరిగినపుడు కాకినాడ నుండి ఒంగోలు వరకు వారి ఉపన్యాసాలను తర్జుమాచేస్తూ ఎం. వి. రామమూర్తి పర్యటించారు. లవణం, విజయం గారలు విజయవాడ, గుడివాడలలో ఉపన్యాసాలను తర్జుమా చేశారు. మొదట్లో కొంత సంకోచించినా భారత నాస్తిక సమాజ స్థాపకులు జయగోపాల్ గారు విశాఖపట్నంలో ప్రదర్శనను ఉపన్యాసాన్ని ఏర్పాటుచేశారు. ఒంగోలులో భారత కమ్యూనిస్టు పార్టీకి చెందిన ప్రముఖులు నిర్వహణ బాధ్యత స్వీకరించారు. మార్క్సిస్టు పార్టీ సభ్యులు, సానుభూతిపరులు ఆయాచోట్ల అనేక విధాలుగా మద్దతు ఇచ్చారు. గురిజాల శీతారామయ్య (తెనాలి), పి. రాఘవరావులు (గుడివాడ) వగైరా రాడికల్ హ్యూమనిస్టులు ప్రదర్శనలను

నిర్వహించారు. మూడు పర్యటనలలోను భారత ప్రధాన కార్యదర్శి ఎ. సూర్య నారాయణ గారు కోవూరు గారి వెంట ఉండి ఏర్పాట్లను స్వయంగా పర్య వేక్షణ చేశారు.

కోవూరి పర్యటనల ఫలితంగా సత్యసాయిబాబా బండారం బట్టబయ లయింది. బాబాల మోసపు చెత్తలు బహిర్గతం అయినాయి. మత శక్తులకు దెబ్బ తగిలింది. హేతువాదం ఎడల ప్రజలకు అభిమానం పెరిగింది. ఈ వాతా వరణంలో 1974 లో ఎం. వి. రామమూర్తి సంపాదకత్వాన వెలువడే 'వికాసం' అనే తెలుగు మాస పత్రిక, తోటకూర వేంకటేశ్వర్లు 1976 నుండి నిర్వహిస్తున్న 'చార్వాక' అనే తెలుగు మాస పత్రిక ఉద్యమ భావవ్యాప్తికి ఎంతో తోడ్పడినాయి. రావిపూడి వెంకటాద్రి, ఈశ్వర ప్రభు, సి. వి. గారల వ్యాసాలు చార్వాక పత్రికకు స్థాయిని ఇచ్చాయి. కోవూరు ఉపన్యాసాలు, వ్యాసాలు తెలుగులో ప్రకటించడం వల్ల చార్వాకకు గౌరవం వచ్చింది. పత్రిక వేల సంఖ్యలో అమ్ముడుపోవటం, ఆంధ్రప్రదేశ్‌లో మారుమూల ప్రాంతాలకు పోవడం జరిగాయి. అనేకచోట్ల హేతువాద సంఘాలు వెలిశాయి. చురుకుగా పనిచేయటం మొదలుపెట్టాయి.

రావిపూడి వేంకటాద్రి, ఎన్. వి. బ్రహ్మం, ఆవుల గోపాలకృష్ణమూర్తి, ఆవుల సాంబశివరావు గారలు భారత హేతువాద సంఘ కార్యకలాపాల్లో పాల్గొన్నా ఆంధ్రలో గాని ఆం. ప్ర. లో గాని హేతువాద సంఘాన్ని రాష్ట్ర స్థాయిలో ఏర్పరచటం జరగలేదు. 1973 లో ఆం. ప్ర. హేతువాద సంఘం ఏర్పడినా రాష్ట్రంలోని అందరి హేతువాదులతో అది ఏర్పడలేదు. గోరా గారి అనుచర వర్గం ప్రధాన బాధ్యులుగా సంఘం పుట్టింది. ఆ సంఘం నామ మాత్రంగా ఉండి. 1975 లో కోవూరు పర్యటనలో ఆ సంఘం పనిచేయక పోయినా కోశాధికారి బి వేణుగోపాల్ కృషి చేసినందునను, సంఘం పేరు వ్యాప్తిచేయాలనే అభిలాషతోను సంఘం పేరుతో కోవూరు కార్యక్రమాలు ప్రక టించబడినాయి

ఏలూరులో రెండు, విజయవాడలో రెండు, ప్రకాశం జిల్లా రావినూతలలో ఒకటి, అధ్యయన శిబిరాలు జరిగాయి. గుసాసీ, తోటకూర, రావిపూడి ప్రభృ

తులు ప్రముఖ పాత్ర నిర్వహించారు: కొల్లాసుబ్బారావు, ఈశ్వర ప్రభు, సి. వి, త్రిపురనేని వేంకటేశ్వరరావు, ఎం. వి. రామమూర్తి, మల్లాదిసుబ్బమ్మ, జ్వాలాముఖి, సంజీవదేవ్, లవణం, విజయం, టి. వేణుగోపాలరావు, వెనిగళ్ళ సుబ్బారావు ప్రసంగాలు చేసినవారిలో ప్రముఖులు.

1978 లో లండన్‌లో జరిగిన ప్రపంచ హ్యూమనిస్టు నైతిక సంఘం వారి మహాసభకు ఎం. వి రామమూర్తి హాజరయి భారత హేతువాద సంఘ కార్యకలాపాలను కూడ తమనివేదికలో ప్రసంగించారు. మల్లాదిసుబ్బమ్మగారు కూడ ఆ మహాసభకు హాజరయ్యారు. ఆ ప్రపంచ సంస్థకు భారత హేతువాద సంఘానికి సంబంధం (contact Group), ఉందనే విషయం గమనార్హం.

రావిపూడివేంకటాద్రి గారి విశ్వాన్వేషణ, 'జీవమంటే ఏమిటి', శాస్త్రం, పురాణం', 'మానవుడు సమాజం ప్రకృతి', ఎన్ వి బ్రహ్మంగారి 'బైబిలు బండారం', సి. వి గారి 'సత్యకామజాబాలి', ఎం. ఎన్ రాయ్‌గారి 'పిల్లఆత్మ కథ', 'వ్యాసాలు', మూకందిలాల్ గారి 'గోపూజ భారతదేశం', కొప్పరపు సుబ్బారావు గారి 'శాస్త్రదాస్యం' ఆర్. వి. సుందరరావు గారి 'శాస్త్రం' విజ్ఞానం, నాగరికత, ఎం వి రామమూర్తిగారి 'జిల్లెళ్ళమూడి అమ్మ', మిత్రా గారి 'ఆలోచించండి' ఎస్. జగన్నాధం గారి 'మూఢవిశ్వాసాలు', త్రిపురనేని కవిరాజు సాహిత్యం (సూత పురాణం, భగవద్గీత, ఖూనీ, శంబుకవధ, శతకాలు; గీతాలు. కురుక్షేత్ర సంగ్రామం, వివాహవిధి), జి. వి. కృష్ణారావు గారి 'భిక్షాపాత్ర' తదితర కథలు, గోరాగారి 'నాస్తికత్వం', 'సృష్టిరహస్యం', 'మూఢనమ్మకాలు: నాస్తిక దృష్టి', గొరిబోయిన పోలయ్య గారి 'విమర్శ రామాయణం', 'పురాణాల్లోబూతు' అంబేద్కరు గారి 'కులనిర్మూలన', 'అస్పృశ్యులెవరు', బోయి భీమన్న గారి 'రాగవాసిష్టం', త్రిపురనేని వేంకటేశ్వరరావుగారి 'యధార్ధభారతి', నార్లవారి 'జాబాలి', 'నార్లవారిమాట', అనేక నాటకాలు, తాపీ ధర్మారావు గారి 'దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకు', పెళ్ళిపుట్టు పూర్వోత్తరాలు' బి. రామకృష్ణగారి 'చార్వాకుడు', వెనిగళ్ళసుబ్బారావు గారి 'పెళ్ళి మంత్రాల బండారం' త్రిపురనేని వేంకటేశ్వరరావు (విజయవాడ) వారి 'వేదాల నుండి ఆదిశంకరుని' వరకు 'శంకరాద్వైతం', ఇంకా ఎన్నో చిన్నగ్రంధాలు

చార్వాకవాది కరపత్రాలు హేతువాద ఉద్యమానికి పరోక్షంగానో, ప్రత్యక్షంగానో తోడ్పడినయి.

ఆంధ్రలో హేతువాద ఉద్యమానికి ఒక రకంగా ఆలోచిస్తే గురజాడ కందుకూరి ప్రభృతులు పునాదివేశారు. త్రిపురనేని రామస్వామి గారు పెంచి పోషించారు. తాపీవారు దానికి అండ దండలు అందించారు. నార్లవారు చేయూతనిచ్చారు. ఎ.జి.కె (అవుల గోపాలకృష్ణమూర్తి) వ్యాసకర్తగా, ఉపన్యాసకుడుగా ప్రచారం సాగించారు. తరువాత రావిపూడి వేంకటాద్రి అందుకున్నారు. ఎ. సూర్యనారాయణ, ఎం. వి. రామమూర్తి వగైరాలు సంఘబాధ్యతలను అఖిలభారత స్థాయిలలో చేపట్టారు.

# ఆం. ప్ర. హేతువాద సంఘ పరిణామం
## (1979 నుండి)

మల్లాది సుబ్బమ్మ
(ఆం. ప్ర. హేతువాద సంఘ ఉపాధ్యక్షులు)

'వికాసం' 'చార్వాక' వగైరా పత్రికలు చేసిన ప్రచారం ఆధారంగా అనేక జిల్లాలలో అనేకచోట్ల హేతువాద సంఘాలు వెలిసినవి. అందులో పశ్చిమగోదావరి జిల్లాలలో గుసెసీ, భాస్కరరావు, రమణారెడ్డి, సూరిగాణ్ణ నిర్వికారాము ప్రయత్నాలవల్ల జిల్లాసంఘం ప్రతిష్టంగా ఏర్పడింది. వారు పూనుకొని ఆంధ్రప్రదేశ్ హేతువాద మహాసభను 1979 మేలో నిర్వహించారు. డాక్టర్ హెచ్. నరసింహయ్య ప్రారంభకులుగా ఏలూరులోని ప్రముఖ న్యాయవాది పి. హెచ్. వి సోమయాజులు అధ్యక్షులుగా మహాసభ జరిగింది. 9 జిల్లాలనుండి 250 మంది ప్రతినిధులు వచ్చారు. అపుడు ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘనియామావళి ఆమోదింపబడింది. రావిపూడి వెంకటాద్రి గారు అధ్యక్షులుగా, కత్తిపద్మారావు మల్లాది సుబ్బమ్మగారలు ఉపాధ్యక్షులుగా, పి. భాస్కరరావు (ఏలూరు) ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయినారు. భారత హేతువాద సంఘంలో ఉపాధ్యక్షులయిన ఎం. వి. రామమూర్తి, ప్రధాన కార్యదర్శిగానున్న ఎ. సూర్యనారాయణ ఎక్స్ ఆఫీషియో సభ్యులుగా, కొల్లాసుబ్బారావు గారు జీవితసభ్యుల ప్రతినిధిగా ఎంపిక అయారు. తరువాత సమష్టి కృషిఫలితంగా ఉద్యమం వ్యాప్తిచెందింది. మెదక్, తూర్పుగోదావరి, కృష్ణా, జిల్లాలలో జిల్లాసంఘాలు ఏర్పడినయి. అంతకు ముందునుంచి ఉన్న నెల్లూరుజిల్లా సంఘం బలపడింది. హైదరాబాద్ నగర సంఘం పునర్వ్యవస్థీకృతమయింది. హేతువాద సంఘాలు ఏర్పడకపోయినా వికారాబాదు, వరంగల్ లాంటిచోట్ల ఉద్యమప్రచారం జరిగింది. 1980 ఫిబ్రవరి నెలలో బ్రిటనులోని జాతీయసెక్యులరు సొసైటీ (ప్రముఖ హేతువాది ఛార్లెస్

ప్రాన్‌లాచే స్థాపించబడిన సంఘం. కోశాధికారి దేవదేఖర్ ఆంధ్రప్రదేశ్‌లో పర్యటించారు. హైదరాబాదు, సికింద్రాబాదు, వరంగల్, విజయవాడ, ఏలూరు, చీరాల, నెల్లూరు పట్టణాలను వారు సందర్శించి సభలలో ఉపన్యాసాలిచ్చారు. వారివెంట ఎం.వి. రామమూర్తి, మల్లాది సుబ్బమ్మలు పర్యటించి ఉపన్యసించారు. ఏలూరులో భాస్కరరావు, చీరాలలో రావిపూడివారలు, నెల్లూరులో రామకృష్ణారెడ్డి గారు సభలను విజయవంతంగా నిర్వహించారు. నెల్లూరుసభ జయప్రదం కావటానికి పి. భీమన్నగారు బాధ్యులు. కృష్ణాజిల్లా పర్యటన రావిపూడి నిర్వహించారు.

రాష్ట్రరాడికల్ హ్యూమనిస్టు సంఘం ఆధ్వర్యాన కాకినాడలో, రినైజాన్సు సమితి తరఫున తెనాలిలో, నెల్లూరుజిల్లా సంఘం ఆధ్వర్యాన నెల్లూరులో, ఒంగోలు హేతువాద సంఘం వారిచే ఒంగోలులో, మెదక్ జిల్లా సంఘం చేత మెదక్‌లో, గుడివాడ హేతువాద సంఘంచేత గుడివాడలో, మండపేట తాలూకా సంఘం తరఫున మండపేటలో చార్వాక వారిచే విజయవాడలో అధ్యయన శిబిరాలు నిర్వహించబడినాయి. మెదక్, కాకినాడ తప్ప అన్నిచోట్ల రావిపూడి ప్రధాన అధ్యాపకుడుగా ఉన్నారు. మండపేట తప్ప అన్నిచోట్ల కత్తి పద్మారావుగారు ఉపన్యసించారు. కాకినాడ శిబిరానికి ఎం. వి. రామమూర్తి ప్రిన్సిపాలుగా వ్యవహరించారు. కాకినాడ, తెనాలి, నెల్లూరు, ఒంగోలు, మండపేటలలో ఎం. వి రామమూర్తి ఉపన్యసించారు. కాకినాడ, ఒంగోలు, తెనాలి గుడివాడ, మండపేట శిబిరాలలో ఎన్. వి. బ్రహ్మం, కాకినాడ, ఒంగోలు, తెనాలి శిబిరాలలో కొల్లాసుబ్బారావు, తెనాలి, నెల్లూరు, ఒంగోలు, మండపేట విజయవాడ రావినూతల శిబిరాలలో ఈశ్వరప్రభు ఉపన్యసించిరి. గుడివాడలో గోపరాజు సాంబశివరావు గారు, తెనాలిలో విజయవాడలలో మల్లాది సుబ్బమ్మ మాట్లాడారు. విజయవాడ శిబిరానికి ఈశ్వరప్రభు ప్రిన్సిపాలుగా ఉన్నారు. విజయవాడ రావినూతల శిబిరాలలో సి. వి. ప్రసంగించారు.

కత్తిపద్మారావుగారు విశేషంగా గ్రామాలలోను, రావిపూడివారు పట్టణాలలోను అనేక సభలలో ఉపన్యసించారు. వెనిగళ్ళ సుబ్బారావు గారి 'పురాణాల్లో బూతు' ఉపన్యాసం యువకులను ఆకర్షించేది. కొంతమంది స్త్రీలకు, వయస్సు మళ్ళినవారికి ఎబ్బెట్టుగా తోచేది.

నరసారావుపేట హేతువాద సంఘం తరఫున 'హేతువాద దర్శిని' అనే సైక్లోస్టైలు సమాచార పత్రికను నసీర్ నడిపారు.

ఇలా ఎందరో పెద్దల సహాయ సహకారాలతో కార్యకర్తల ఉత్సాహ పూరిత దీక్షతో ఉద్యమం పుంజుకుంది. గణనీయమైన స్థితికి వచ్చింది

1981 మార్చిలో రాష్ట్ర కార్య నిర్వాహక కమిటీ సమావేశం ఏలూరులో జరిగింది. ముఖ్యంగా రాష్ట్ర మహాసభ నిర్వహణ యత్నాలను నిర్ధారణ చేయటానికి ఆ సమావేశం ఉద్దేశించబడింది. తూర్పు గోదావరి జిల్లా సంఘం తరఫున మహాసభను రాజమండ్రిలో జరపటానికి ఆహ్వానించే నిమిత్తం జిల్లా కార్యదర్శి ఎన్. వేంకటరావుగారు, పుల్లేశ్వరరావు గారు వచ్చారు. ఆ సభకు నరసారావు పేట సంఘాధ్యక్షుడైన ఎస్. వి. రావు గారిని తీసుకొచ్చారు కత్తి పద్మారావు గారు. స్నేహధర్మంగా కత్తి పద్మారావు గారిని అధ్యక్షస్థానంలో కూర్చోబెట్టారు రావిపూడి వారు. దాంతో అవకాశం దొరికింది కత్తివారికి. తను ఏదో చెప్పటం మరొకరు ఆ విషయంమీద మాట్లాడేలోగా చేతులెత్తండి అని హెచ్చరించడం చేయటం మొదలుపెట్టారు. అక్కడచేరిన పెద్దలలో ఒకరు మందలించడం జరిగింది. సమావేశం అంతమయ్యే సమయంలో రావిపూడి వారు ప్రచురించిన పుస్తకం 'భావ విప్లవం : వర్గ చైతన్యం' అనేదానిని గురించి ఏదో లేఖ చేరింది కదా అని భాస్కరరావుగారిని హెచ్చరించారు కత్తివారు. 'అవును' చేరిందన్నారు భాస్కరరావుగారు. దీనిపై చర్చసాగించారు కత్తివారు. 'దీని విషయమై రావిపూడి వారికి తెలుసునా? వారిని సంజాయిషీ అడిగారా? 'అని అడిగితే లేదన్నారు. అలాంటప్పుడు చర్చ వీలు లేదన్నారు కొందరు. అంతటితో లాంఛనాయుతమైన చర్చ ముగిసింది. ఆ పుస్తకాన్ని 'హేతువాద ప్రచురణలు, గుడివాడ' వారు ప్రచురించారు. ఆ పుస్తకం మార్క్సిస్టు వ్యతిరేకమైనదని కనుక 'హేతువాద ప్రచురణలు' అనే పేరుతో ప్రకటింపబడితే ఉద్యమాన్ని అపార్థం చేసుకుంటారని విమర్శ వచ్చింది.

'హేతువాదం' పత్రిక ప్రథమ సంచికలో రావిపూడివారిని సంపాదక వర్గంలో చేరిస్తే వారు తమ పేరు తీసివేయించారు.

1981 మేలో రాజమండ్రిలో రాష్ట్ర మహాసభ బ్రహ్మాండంగా జరిగింది. దానిని నిర్వహించిన ఘనత జి. పుల్లేశ్వరరావు, ఎస్ వెంకటరావు, ఎన్ ఎ. బక్ష్, తూర్పుగోదావరి జిల్లాసంఘ అధ్యక్షులు, రామారావుగారు వగయిరా మిత్రుల

ను పఠించి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి జీవన్‌రెడ్డిగారు మహాసభను ప్రారంభించారు. రావిపూడిగారు అధ్యక్షత వహించారు. అఖిలభారత హేతువాదసంఘ ఉపాధ్యక్షులలో ఒకరైన ఎడమరుకు గారు (ఢిల్లీ) ప్రముఖోపన్యాసకులు. ఎస్. వి. గారి సంపాదకత్వాన వెలువడే 'హేతువాదం' అనే పత్రికను ఎడమరుకు గారిచేత ప్రారంభోత్సవం చేయించటం జరిగింది సంపాదకుల అభ్యర్థనపై.

రెండవ రోజు మధ్యాహ్నం జిల్లాసంఘాల అధ్యక్షులు కార్యదర్శులు తమ జిల్లాల నివేదికలకు సమర్పించే సమయంలో ఒంగోలు జిల్లాతరఫున గోపాలరెడ్డి గారు మాట్లాడుతూ నివేదిక విషయం మర్చిపోయి రావిపూడివారు ప్రచురించిన 'మార్క్సిస్టు వాస్తవికత' అనేపుస్తకం "హేతువాద ప్రచురణలు, గుడివాడ" అనే పేరుతో వెలువడడాన్ని విమర్శించారు. అధ్యక్షులు వారించారు, అంత అపుస్తకాన్ని ప్రశంసిస్తూ అభిప్రాయాలున్న కరపత్రం పంపిణీ చేయించారు అధ్యక్షులు. దానికి అభ్యంతరంచెప్తూ పెద్దగా కేకలువేస్తూ గోపాలరెడ్డిగారు బయటకివచ్చారు. అంతకు క్రితమే ఎన్నికల యుద్ధానికి తయారవుతున్న కత్తి పద్మారావు గారితో మాట్లాడుతున్న ఎం. వి. రామమూర్తిగారి వద్దకువచ్చారు గోపాలరెడ్డిగారు. వాతావరణం ఉద్రిక్తమయింది. ఎన్నికలకు సన్నద్ధమయ్యారు జి. పుల్లేశ్వరరావు గారు కత్తిపద్మారావుగారు ప్రధాన కార్యదర్శి పదవికోసం ఇరుపక్షాలు తలపడటానికి సిద్ధపడ్డారు ఎన్నికలలో.

ఎస్. వి. గారు వచ్చి రాజీపర్చవలసిన పరిస్థితి ఉందనిచెప్తూ అఖిల భారత ప్రధాన కార్యదర్శి అయిన ఎం. వి. రామమూర్తిగారి జోక్యాన్ని అర్థించారు. తాను సాక్షిగా ఉంటాననీ ఇరుపక్షాల ప్రతినిధులు సమావేశమయి తేల్చుకోవాలని రామమూర్తిగారు చెప్పారు. అలాగే ఒక కమిటీకూడింది. చర్చలుసాగుతున్నాయి. ఈలోగా వర్షం పెద్దపెట్టున వచ్చి ప్రతినిధులు మేడ మీదికి చేరవలసి వచ్చింది. అధ్యక్షులుగా రావిపూడివారిని ఏకగ్రీవంగా ప్రకటించటం జరిగింది. అంత ప్రధాన కార్యదర్శి పదవి మాకు కావాలంటే మాకుకావాలని పుల్లేశ్వరరావు, కత్తిపద్మారావువర్గాలు పట్టుపట్టాయి. చర్చ ఎంతసేపుసాగినా వాదోపవాదాలు ఎంతకాలం కొనసాగినా నిర్ధారణకు రాలేకపోయారు; ప్రతిష్టంభన ఏర్పడింది. అంత రామమూర్తిగారు ఒక సూచన చేశారు. ప్రధాన కార్యదర్శిగా కత్తిపద్మారావు గారు ఉండాలని, కార్యనిర్వాహక కార్యదర్శిగా

పుల్లేశ్వరరావు గారు ఉండాలని రాష్ట్ర కార్యాలయం పుల్లేశ్వరరావుగారి నివాసస్థల మైన రాజమండ్రిలో ఉండాలని వాదించారు. దానికి కత్తిపద్మారావుగారు ఒక అభ్యంతరం చెప్పారు. అదేమంటే కార్యాలయంలో ఏమిజరిగేది తనకు తెలియక పోతే తను ప్రధాన కార్యదర్శిగా ఉండటం నిష్ప్రయోజనకరమని. దానికి మరో వివరణ ఇచ్చారు రామమూర్తిగారు. ప్రధాన కార్యదర్శి ఉద్యమ వ్యాప్తికి, సంఘనిర్మాణానికి బాధ్యత వహిస్తారని, వారిభయ సందేహాలు పోగొట్టేనిమిత్తం అఖిలభారత కార్యాలయం నుండి, జిల్లా కార్యాలయాలనుండి వచ్చే ఉత్తరాల నకళ్ళు ప్రధాన కార్యదర్శికి పంపుతారని చెప్పటం జరిగింది. ఇరుపక్షాలవారు సమ్మతించారు. అంత తతిమ్మా పదవులు కార్యనిర్వాహక వర్గసభ్యత్వాలు సరి సమానంగా ఇరువురు పేర్కొనటం, ఏకగ్రీవంగా జాబితా పూర్తికావటం జరిగింది. అందరూ హర్షంతో ప్రతినిధుల వద్దకువెళ్ళి ఈ విషయం చెప్పారు. తగాదా సమసిపోయినందుకు అందరు ప్రతినిధులూ సంతోషించారు.

మహాసభ జరిగిన తరువాత జూన్ 82 లో క్రైస్తవ మఠాధిపతులు ఏర్పాటుచేసిన సమావేశానికి కత్తి పద్మారావు గారు హాజరయినారు.

సుహృద్భావ వాతావరణంలో రాజమండ్రి మహాసభ ముగియటంతో కార్య క్రమాలమీదికి కార్యకర్తలందరూ దృష్టి మళ్ళిస్తారు కదా అని తలపోయడం జరిగింది. కాని అలా జరుగలేదు. విజయవాడలో ఏర్పాటు చేయబడిన తేది. 27-9-81 కార్యవర్గ సమావేశంలో ప్రథమ అంశంగా అధ్యక్షుడైన రావిపూడిపై అభియోగం రంగంమీదికి వచ్చింది. అధ్యక్షులు మార్క్సిజాన్ని విమర్శిస్తూ పుస్తకాలు వ్రాయడం సబబు కాదన్నది కత్తి పద్మారావుగారి వర్గం. సబబే అన్నది రావిపూడిని సమర్థించే వర్గం. ఉదయం 10 గంటలనుండి మధ్యాహ్నం 3 గంటలవరకు (భోజన విరామ సమయం మినహా) అదే అంశంపై చర్చ సాగింది. అందరూ మాట్లాడారు. చీలిక ప్రస్తావన వచ్చింది ఉపన్యాసాలలో. చీలిక అంత కష్టంకాదని లెక్కవేస్తే చెరి ఒక 14 వోట్లు ఉన్నాయని రామమూర్తి గారు అంటే వెంటనే 'అంతటితో ఆ విషయం ఆపి వేద్దాము' అని కత్తి పద్మారావు గారు మరో అంశాన్ని చర్చకుపెట్టారు. సభలో సంచలనం కలగటం చర్చలకు అనువైన వాతావరణం లోపించటం జరిగింది. ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళారు. కార్యక్రమంపై చర్చ సక్రమంగా పూర్తిగా జరుగలేదు. సహాయ కార్యదర్శి శ్రీమతి సావిత్రి గారు (రాజమండ్రి) తమ

కాలాన్ని మరో ఉద్యమానికి అంకితం చేయదల్చామని అందువల్ల తమ పదవికి రాజీనామా పెడుతున్నామని రాజీనామా పత్రం సమర్పించారు. ఇలా ముగిసింది, విజయవాడ సమావేశం.

గుడివాడలో విరసం రాష్ట్ర సభలు జరిగాయి. ఆ సందర్భంలో ఒక సభలో విరసం ప్రధాన కార్యదర్శి రావిపూడి వేంకటాద్రి గారిని పేర్కొని, వారి 'మార్క్సిస్టు వాస్తవికత' అనే గ్రంథాన్ని తీవ్ర పదజాలంలో విమర్శించడం, దానితో కలతచెందిన రాష్ట్ర హేతువాద సంఘ కార్యనిర్వాహక సభ్యుడు గణేశ్వరం బాబూరావు అలా విమర్శించేకన్నా ఒకే వేదికమీద ఇరువురు అంటే రావిపూడి వారు త్రిపురనేని మధుసూదనరావు గారు మాట్లాడటం సబబని 'అలాంటి ఏర్పాటుకు మధుసూదనరావు గారు సిద్ధమేనా ?' అని ప్రశ్నించడం జరిగింది. మధుసూదనరావు గారు తమ అంగీకారం తెలిపారు. దాంతో రావిపూడి వారిని తెచ్చేబాధ్యత తమదని బాబూరావు గారు చెప్పారు. విరసం సభకు అధ్యక్షత వహించిన టి. వేణుగోపాలరావు (సిద్ధార్థ కాలేజీ ప్రిన్సిపాలు, విజయవాడ) గారిని ఆ సిద్ధాంత చర్చకు అధ్యక్షత వహించమని కోరడం, వారు అంగీకరించడం, బాబూరావు గారి అభ్యర్థనకు రావిపూడి వారు అంగీకరించి సిద్ధాంత చర్చలో పాల్గొనడానికి సిద్ధపడటం చకచకా జరిగిపోయాయి. ఈ సిద్ధాంత చర్చను గుడివాడ హేతువాద సంఘం నిర్వహించ పూనుకున్నది. ఒక కరపత్రం వేశారు గుడివాడవారు. అందులో 'మార్క్సిజం తరపున ప్రముఖ మార్క్సిస్టు విరసం ప్రధాన కార్యదర్శి త్రిపురనేని మధుసూధనరావు గారు, రాడికల్ హ్యూమనిజం తరపున ప్రముఖ రాడికల్ హ్యూమనిస్టు ఆం. ప్ర. హేతువాద సంఘాధ్యక్షులూ అయిన రావిపూడి వెంకటాద్రి గారు సిద్ధాంత చర్చలో పాల్గొంటారు' అని వ్రాయబడింది.

ఇది కత్తి పద్మారావు గారి వర్గానికి దాడికి అవకాశం అయింది. మరి కొంతమంది మిత్రులకు కలవరపాటు కల్గించినట్లు విదితమయింది. ఎస్. వి. రావు, ఈశ్వరప్రభు, కత్తి పద్మారావు, ఎన్. సాంబశివరావు గార్లు తదితరులు కలిసి "ఈ చర్చతో రాష్ట్ర సంఘానికి సంబంధంలేదని ఈ సంఘంవారు అభిప్రాయపడుతున్నారు" (వక్కాణింపు మాది) అని కరపత్రం అచ్చువేశారు హడావుడిగా పత్రికలకు ఎక్కారు. 'ప్రజాశక్తి'లో ప్రకటితమయింది ఈ వార్త.

గుడివాడలో తేది 13-12'81 చర్చ జరిగింది. అందు విషయంగా జరి

గిన అవకతవకలు, నియమ వ్యతిరేకతలు, అధ్యక్షుని పక్షపాత వైఖరి ఇవన్నీ ప్రస్తుతం వ్రాయనక్కరలేదు. వాటి విషయమై "అరుణతార", "రాడికల్ హ్యూమనిస్టు"లలో వాదప్రతివాదాలు జరుగుతున్నాయి.

ప్రధాన కార్యదర్శిగా కత్తిపద్మారావుగారు ఒక సర్క్యులరు జారీచేశారు. దానిలో ప్రధాన విషయాలు 1. పాములు తినే కార్యక్రమాలు చేపట్టటం 2. ప్రదర్శనల ద్వారా వచ్చిన పైకంలో నాల్గవవంతు రాష్ట్ర కార్యాలయానికి, మరో నాల్గవవంతు హేతువాద పత్రికలకు పంపాలి అనేవి. ఈ కార్యక్రమం రాష్ట్ర కార్యవర్గం ఆమోదించింది కాదు. తనేతయారుచేసి అధ్యక్షుని ఎరుక సమ్మతులులేకుండా ఇతర ఉపాధ్యక్ష సహాయ కార్యదర్శులకైనా తెలుపకుండా జారీ చేయబడింది ఈ సర్క్యులరు. దానిని శిరసావహించి ప్రదర్శన నికరాదాయంలో నాల్గవ భాగం రు 500 'హేతువాదం' అనే పత్రికకు పంపారు భద్రాచలం హేతువాద సంఘంవారు. అలాగే రు 500 రాష్ట్ర కార్యాలయానికి పంపారు. ఈ విషయాన్ని కార్యనిర్వాహక సభ్యులైన భానుప్రసాద్ గారు తదితర సభ్యులకు తెలియజేశారు. దీంతో దిగ్భ్రాంతి చెందారు కొందరు సభ్యులు. 'హేతువాదం' అనేపత్రిక రాష్ట్ర సంఘ అధికారిక పత్రిక కాదు గదా! దానికి ప్రధాన కార్యదర్శి ఎలా పైకం వసూలు ఏర్పాటు చేస్తున్నారని విమర్శవచ్చింది. అంతేగాక ప్రధాన కార్యదర్శి కత్తిపద్మారావుగారి ఉపన్యాసాలలో పేరుపేరున కొన్ని కులాలవారిని ఎగతాళిగా పేర్లని నిందించటం జరుగుతుందని, తీవ్రవాద పదజాలంతో కూడికొనిఉందని హేతువాద ఉద్యమ ఐక్యతకు అవి భంగం కల్గిస్తున్నవని కొందరు భావించారు కార్యనిర్వాహక వర్గకార్యదర్శి చేసిన విమర్శకు ప్రత్యామ్నాయంగా పద్మారావుగారు రశీదులను అచ్చు వేయించారు. రాష్ట్రాధ్యక్షునికి తెలియకుండా, ఇదివరకు అమలులో ఉన్న జిల్లా సంఘాధికారులకు తెలియకుండా గుంటూరు, ప్రకాశంజిల్లా సంఘాల పునర్నిర్మాణం చేశారు. ఇదంతా ఒక పథకం ప్రకారం జరుగుతున్న ఎత్తుగడగా తోచింది కొందరికి.

గుడివాడ చర్చలో పాల్గొన్నందుకు రావిపూడివారిని అభిశంసించాలని కత్తివారి పట్టుదల మొండి అయింది. 21 ఫిబ్రవరి 82 తేదీన కార్యవర్గ సమావేశం ఏర్పాటు చేయదల్చానని కత్తిపద్మారావుగారు అధ్యక్షునికి వ్రాశారు. ఆ తేదీ తనకు వీలుకాదని రావిపూడివారు జవాబిచ్చారు. అంతలో 28-2-82

ఎన్. సాంబశివరావు గారు వచ్చి రావిపూడి వారిని కలసి 'కె. ప్రభాకర శాస్త్రి, జి. మార్కండేయులు ఏమైనా ఉత్తరాలు వ్రాశారా ? 'అని అడిగి పోవటం జరిగింది. మార్కండేయులు గారు వచ్చి అధ్యక్షునితో మాట్లాడటం, "తాపిగా ఏమీచేయలేము, తే 21-3-82 ది సమావేశానికి రాజమండ్రి రమ్మన మని" రావిపూడివారు కోరటం జరిగింది. ఇంకా తమ స్వంత అభిప్రాయాలు కొన్నింటిని రావిపూడి ప్రకటించారట.

తే॥ 21-3-82 న రెండు సమావేశాలు జరిగాయి. గుంటూరులో సమావేశానికి ఎస్. వి. రావుగారు అధ్యక్షత వహించినట్లున్నూ, అందులో రావిపూడి గారిని అధ్యక్షపదవినుండి తొలగించినట్లున్నూ వార్త 'హేతువాదం'లో ప్రచురితమయింది విశాలాంధ్రలో వచ్చింది. ఆంధ్రరాష్ట్ర హేతువాద సంఘ పత్రికగా 'హేతువాదం' అచ్చయింది. ఈశ్వరప్రభుగారు తాత్కాలిక అధ్యక్షులుగా నియమితులయ్యారట.

తే 21-3-82 న రాజమండ్రిసమావేశంలో ప్రధానకార్యదర్శి పదవి నుండి కత్తి పద్మారావు గారిని తొలగించటం, వెల్లూరి సమావేశానికి అధ్యక్షత వహించిన ఎస్. వి. రావుగారిని ఉపాధ్యక్ష పదవినుండి తొలగించటం, వారిరువురి సాధారణ సభ్యత్వాలు రద్దుచేయటం జరిగాయి రాజమండ్రిసమావేశంలో పాల్గొన్నవారి పేర్లు ఇవి.

1. రావిపూడి వెంకటాద్రి (అధ్యక్షులు) 2. గోపరాజు సాంబశివరావు (ఉపాధ్యక్షులు) 3. పుట్లేశ్వరరావు (కార్యనిర్వాహక కార్యదర్శి) 4. ఎన్. వెంకటరావు (కార్యదర్శి) 5. కొల్లా సుబ్బారావు (జీవితసభ్యులు) 6. చుండూరి నాగయ్య (ప్రకాశంజిల్లా) 7. ఎం బసవపున్నారావు (గుంటూరుజిల్లా) 8. గణేశ్వరం బాబూరావు (కృష్ణాజిల్లా) 9. ఎన్. రామారావు (తూర్పుగోదావరిజిల్లా) 10. ఎం. విజయకుమార్ (కోటా) 11. జి వీరన్న (హైదరాబాద్) 12. ఎ. పూర్ణచంద్రరెడ్డి (విశాఖపట్నం) 13. డా॥ వై. భానుప్రసాద్ (ఖమ్మంజిల్లా) ఉత్తరాలద్వారా సమ్మతిని తెలిపినవాళ్ళు 14. మల్లాది సుబ్బమ్మ (ఉపాధ్యక్షులు) 15. నాగేశ్వరరావు (హైదరాబాదు) తర్వాత ఆమోదాన్ని తెలిపినవారు 16. లవణం (సెక్రటరీ) 17. ఎస్. ఆర్. సూరి (ప. గోదావరి) 18. పి. కృష్ణమూర్తి (కర్నూలు) సమావేశానంతరం 19. ఎం.వి. రామమూర్తి (భారత హేతువాద సంఘకార్యదర్శి) 20. ఎస్.ఎ బక్ష్ (తూ.గో. జిల్లా అధ్యక్షుడు) 21. టి. సుకు

మారి రెడ్డి వచ్చారు. తెనాలి, భీమవరం, గుంటూరు, పాలకొల్లు, గుడివాడ, ఒంగోలు, రాజమండ్రి, రామచంద్రపురం, పూనా రేపల్లె వగైరా ప్రదేశాలనుండి 50 మంది స్థానిక సంఘాల అధ్యక్షులు, కార్యకర్తలు వచ్చారు

వీరివల్ల తేలిందేమిటి ?

1. 1981 మార్చినుండి రావిపూడివారిని త్రోసి రాజనటానికి కత్తివారు పథకం వేస్నారు.

2. మార్క్సిజంపై రావిపూడి వారి విమర్శిస్తూ పుస్తకం వ్రాయవచ్చును కానీ 'హేతువాద ప్రచురణ' పేరుతో ప్రకటించరాదు అన్నారు. ఇది మార్క్సిస్టు వైఖరి.

3. మహాసభ ప్రతినిధులలో తమకు మెజారిటీ లేదని గ్రహించి రాజీ పేరుతో సమంగా పదవుల పంపిణీ చేయించుకున్నారు.

4 విజయవాడ సమావేశం నాటికి మాటమార్చారు. మార్క్సిస్టు పంథాను విమర్శిస్తూ అధ్యక్షులు పుస్తకాలే వ్రాయరాదన్నారు.

5 పామూరు కార్యక్రమం పేరుతో 'హేతువాదం' పత్రికకు నిధులు సేకరించవద్దనారు: సేకరించారు.

6 పథకం ప్రకారం ఒంటెత్తుగా గుంటూరు ప్రకాశం జిల్లాల సంఘాలను పునర్నిర్మాణం చేశారు.

7. గుడివాడ సదస్సు సందర్భంగావేసిన కరపత్రంలో 'ఈ సంఘం వారు' అనివ్రాసి వేరే సంఘాన్ని ఏర్పాటు చేయాలనే ఆకాంక్షను (అనాలోచితంగా) బయట పెట్టారు.

8. గుంటూరు సమావేశం హడావుడిగా ఏర్పాటుచేశారు. రావిపూడి వారికి, వారిని మద్దతు చేస్తారని తోచిన ఇతరులకు, రాజీఅంటారేమోనని అ. భా. ప్రధాన కార్యదర్శి రామమూర్తిగారికి నోటీసులు ఇవ్వలేదు.

9. అ. భా. హేతువాద సంఘానికి నిబంధనావళి ఉండగా, ఆ సంఘ లక్ష్యాలు ఆదర్శాలు స్పష్టంగా ఉండగా వేరే ప్రణాళికను, నిబంధనావళి తయారు చేయించారు.

10. ముసాయిదా ప్రణాళిక, నిబంధనావళుల నకళ్ళను సభ్యులకు ముందుగ పంపలేదు.

11. ఏక పక్షంగా తే 26-2-82 సమావేశాన్ని లా ప్రకారం చెల్లని

దాని , మహాసభలో ఒప్పిన సుహృద్భావ వ్యతిరేకమైన దాన్ని ఏర్పాటు చేశారు.

12. జెంగమూడు సమావేశానికు కత్తిపద్మారావు గారు హాజరయి వచ్చిన తరువాత బైబిలుపై వారి విమర్శలో వాడి, వేడితగ్గాయని శ్రోతలు భావించటం జరిగింది.

13. చీలిక తేవాలని సంకల్పించి, 'హేతువాదం' పత్రికను ఆంధ్ర ప్రదేశ్ హేతువాద సంఘ పత్రికగా తీర్చిదిద్దాలని అభిలషించి, పథకం ప్రకారం ఉక్కిత్వాలకు గడంగారు కత్తిపద్మారావు, ఎస్. వి. రావుగారలు. కాని పాపం ఉద్యమాన్ని చీల్చలేకపోయారు ! కొద్దిమంది వేరుగా వ్యవహరించినంత మాత్రాన ఉద్యమం నష్టపడదు ; సంఘం ఆగిపోదు.

14. కాగా రావిపూడి వారిపై ఇదంతా వ్యక్తిగత కక్షవల్ల జరిగిందా ? సిద్ధాంత విభేదాలవల్ల జరిగిందా ? సిద్ధాంతపరమైన భేదాభిప్రాయాలయితే రాజమండ్రి మహాసభలో రాజీ ఎలా సాధ్యమయింది ? రాజీ పదవుల పంపిణీకే పరిమితమయింది కదా ! మొదట్లో 'హేతువాద ప్రచురణల' పేరుకు అభ్యంతరం, తరువాత రావిపూడివారు రచనలు చేయటానికి అభ్యంతరం. అంటే రావిపూడివారిని రచనల పేరుతో అంటే మార్క్సిజాన్ని విమర్శించే రచనలు ఆయన చేయరాదనే నెపంతో నెట్టివేయ పూనడం కత్తి పద్మారావు' ఎస్. వి. రావుగారల ఆంతర్యం అని తెలుస్తున్నది.

15. రాజకీయ ఆర్థిక విషయాలను హేతువాద సంఘలోనికి చొప్పించరాదని హేతువాద సంఘ వేదిక మీద ఆ విషయాల ప్రసక్తి రాకూడదని హేతువాద సంఘ సభ్యులు స్వచ్ఛందముగా నియమం ఏర్పాటు చేసుకున్నారు. దానిని పాటిస్తూ వచ్చారు. హేతువాదులకు రాజకీయాలు లేవనికాదు. హేతువాద సంఘానికి రాజకీయ ఆర్థిక కార్యక్రమం లేదని మాత్రమే ఆనియమ భావం. హేతువాదులు అనేక తెగల వారున్నారు. నాస్తికులు, అజ్ఞేయవాదులు (Agnostics), మార్క్సిస్టులు, హ్యూమనిస్టులు, రాడికల్ హ్యూమనిస్టులు, ఉదారవాదులు (Liberals), స్వేచ్ఛాభావుకులు (Freethinkers) ఇలా ఎందరో ఉన్నారు. అందరికీ ఒకే రకపు రాజకీయాలు

వేరు రాజకీయాలను సంఘ పరిధిలోనికి తెస్తే సంఘం విచ్ఛిన్నమవుతుంది. వారి రాజకీయాలను వారు ఇతర వేదికలపై ప్రసంగిస్తారు. ఒక వ్యక్తికి అనేక రంగాలలో వ్యక్తిత్వాలు ఉంటాయి. అయితే హేతువాద సంఘంలో కృషి చేస్తున్నంత మాత్రాన అతడు తన ఇతర భావాలను చంపుకోవాలనటం న్యాయం కాదు; కాకపోతే సంఘాన్ని తన రాజకీయాలకు వాడుకోరాదు. కనుకనే భారత హేతువాద సంఘ సభ్యులలో మార్క్సిస్టులు, సోషలిస్టులు, హ్యూమనిస్టులు, ఇందిరమ్మ అంటే గౌరవభావం కలవారు సహజీవనం చేస్తున్నారు. ఈ అంశాన్ని సక్రమంగా గ్రహించ లేక, గ్రహించినా వక్రభాష్యం చెప్పి హేతువాద సంఘం నుండి విడిపోవడం అనుచితం.

16. ఇంతకూ హేతువాద సంఘ కార్యకలాపాలతో 1976 నుండి మాత్రమే జోక్యం పెట్టుకున్న ఈశ్వర ప్రభుగారు, 1979 మేలో రంగప్రవేశం చేసిన కత్తి పద్మారావుగారు, 1980 నుండిమాత్రమే సంఘ కార్యకలాపాల్ని ఆసక్తి చూపటం మొదలుపెట్టిన ఎస్. వి. రావుగారు 1944 నుండి 'కవిరాజాశ్రమం 'నాగండ్ల' పేరుతో హేతువాద ఉద్యమానికి ఇతోధికంగా కృషి చేస్తున్న రావిపూడివారిని త్రోసివేయాలని తాపత్రయపడటంతో అంతరార్థాన్ని అందరూ గ్రహిస్తున్నారు.

17. సంఘంలో ప్రవేశించినప్పటినుండి అంటే 1979 మే నుండి మనస్సులో రావిపూడి వారిపై దురభిప్రాయం పెంచుకొని, ఎవరినైనా కలుపుకొని–కొన్నాళ్ళు గోరాగారి పాజిటివ్ నాస్తికులను, కొన్నాళ్ళు భారత నాస్తిక సమాజం వారిని సంఘంలోనికి ఎలాగైనా తేవాలని-రావిపూడిని త్రోసివేయాలని కత్తి పద్మారావు గారి భావన అయినట్లు స్పష్టమవుతున్నది. జయగోపాల్ గారు తమ సంఘాన్ని రద్దుచేసుకునే ప్రసక్తిలేదని ఎన్నడో చెప్పారు. అలాగే గోరా గారి అనుయాయులు తమ సంస్థలను మరొకరి సంఘాలతో విలీనంచేసే సమస్యే లేదని అందరికీ తెలుసు. నెల్లూరు కార్యనిర్వాహక వర్గపు ఇష్టాగోష్ఠి సమావేశంలో ఈ విషయాన్ని హజరత్ ఆలీగారు-లవణంగారికి సన్నిహితులు-స్పష్టంగా చెప్పారు. మరి ఎందుకీ ప్రయత్నం ? ఏదో ఐక్యతకోసం కృషి చేస్తున్నట్లు నటన; అంతే. అసలు మనస్సులోని భావం వేరు. ఇంతకూ గుడివాడ సద

స్టేజీ పైన పాల్గొనడం రావిపూడివారి నేరమా? సదస్సును ఏర్పాటు చేసింది గుడివాడ హేతువాద సంఘాలు. హేతువాద సంఘాలు తమ శిబిరాలలో గతితార్కిక భౌతిక వాదాన్ని, కమ్యూనిజాన్ని, రాడికల్ హ్యూమనిజాన్ని అధ్యయన విషయాలుగా చేసిన విషయం సర్వులకు విదితమే. ఏలూరు క్యాంపులో గతి తార్కిక భౌతిక వాదం నెల్లూరు క్యాంపులో కమ్యూనిజం, రాడికల్ హ్యూమనిజం కూడ ఉపన్యాస విషయాలు అయినాయి. హేతువాద సంఘం దేనినైనా చర్చించవచ్చు. సత్యాన్వేషణ దానికి ప్రధాన కర్తవ్యం, కాగా ఏదో కావు వేసుకోవటం తప్పు.

గుడివాడవారు చేసిన కరపత్రానికి అభ్యంతరమైతే దానిని సక్రమంగా అవగాహన చేసుకుంటే అపోహతొలగిపోతుంది. ఒక వ్యక్తిని వర్ణించేటప్పుడు అతని ఇతర హోదాలను వ్రాస్తారు ; అంతే. ఇంతకూ అం. ప్ర. హేతువాద సంఘం తరపున చర్చలో రావిపూడివారు పాల్గొంటున్నట్లు వ్రాయలేదే ! రాడికల్ హ్యూమనిజం తరపున పాల్గొంటున్నట్లు వ్రాయబడింది.

ఇంతకూ రావిపూడి చేసిన మహాపరాధం ఏమిటి ? ఆహ్వానాన్ని అంగీకరించి విద్వద్గోష్ఠుల సరళిలో సదస్సులో పాల్గొనటమా ? ఎంత విడ్డూరం ఈ విమర్శ!

ఈ తగాదాలేనా సంఘ కార్యక్రమం ఏమైనా జరిగిందా ? రావిపూడివారు "నాస్తికత్వం; నాస్తికత్వం 'నాస్తికులున్నారు జాగ్రత్త', 'హేతువాదం', 'హేతువాదతత్వం,'మతతత్వం'ఇస్లాం ఒక అంచనా' ప్రచురించారు. 'విశ్వాన్వేషణ'మరో ముద్రణ వేశారు. విశేషంగా చార్వాకశో వ్రాశారు. సభలలో పాల్గొని ఉపన్యసించారు. ఎం. వి రామమూర్తిగారు'హేతువాదం అంటే' అనే గ్రంథాన్ని వెలువరించారు. హేతువాదంపై అనేక వ్యాసాలను మల్లాది సుబ్బమ్మ గారు పత్రికలలో వ్రాసి తమ వ్యాస సంకలనాలలో ప్రకటించారు. ఎన్. వి. బ్రహ్మం గారు 'బైబిలు బండారా'న్ని పునర్ముద్రణ చేశారు. ఎ. వి. షాగారి 'శాస్త్రీయ దృక్పథం అంటే ఏమిటి ?' అనే పుస్తకాన్ని మరల తెలుగులో అనువాదం చేసి అచ్చు వేయించారు. ఎన్. ఇన్నయ్యగారు. నరసరావుపేటనుండి ఏడాదినుండి 'హేతువాదం' మాసపత్రికను ఎన్. వి. గారు నడుపుతున్నారు వికాసాన్ని' పునరుద్ధరించారు ఎం. వి. రామమూర్తిగారు. 'చార్వాక' ను నడుపుతున్నారు తోట

కూడా వెలువరిస్తున్నారు. కత్తిపద్మారావుగారు 'కులవ్యవస్థ' అనే పుస్తకం వ్రాశారు. నెల్లూరుజిల్లా హేతువాదసంఘంవారు పి. భీమయ్యగారి ప్రోత్సాహంతో జె. మార్కండేయులుగారి పట్టుదలతో 'కులం పుట్టుక' 'మతమంటే ఏమిటి' 'సృష్టికిమూలం'' అనే వ్యాససంకలనాలను ప్రచురించారు. ఈశ్వరప్రభుగారు 'మతాలమాయాబజారు'ను, సి. వి. గారు' డార్విన్ పరిణామసిద్ధాంతాన్ని' ప్రచురించారు.

శ్రీ పి. భాస్కరరావు రాష్ట్ర సంఘ ప్రధాన కార్యదర్శిగా తన బాధ్యతను సమర్థవంతంగా నిర్వహించారు. రెండు సంవత్సరాలు (1979-81) ఆ కాలంలోనే సంఘం బాగా పుంజుకున్నది.

అనేక హేతువాద అధ్యయన శిబిరాలు జరిగాయి. ఫిబ్రవరి 82 లో రెండు రోజులు హైదరాబాద్‌లో అధ్యయన శిబిరాన్ని జి. వీరన్న, మల్లాది సుబ్బమ్మలు నిర్వహించారు. రావిపూడి, ఎం. వి. రామమూర్తి, జి. వెంకటస్వామి, జి. వీరన్న ప్రసంగించారు.

కర్నూలులో హేతువాద సంఘం ఏర్పడింది. ఖమ్మంజిల్లా సంఘాన్ని నిర్మించారు కత్తిపద్మారావుగారు. రావిపూడి, మల్లాదిసుబ్బమ్మ, కత్తిపద్మారావు, ఈశ్వరప్రభుగారలు విశేషంగా సభలకు వెళ్ళిన వారిలో ముఖ్యులు. రాజమండ్రిలో నిరసన ప్రదర్శన, అరెస్టులు జరిగాయి. ఇలా ఎన్నో రచనల అండదండలతో, ప్రచారంతో ఎందరో కార్యకర్తల సేవా ఫలితంగా రాష్ట్రసంఘం బాగా బలపడింది. హేతువాదసంఘం అంటే మతస్తులకు భయం ఏర్పడింది ఇలాంటి సమయంలో కత్తిపద్మారావుగారు, ఎన్. వి. రావుగారు విడిపోవటం శోచనీయం. ఈశ్వర ప్రభులాంటి వయోవృద్ధులు వారికి మద్దతు ఇవ్వటం బాధాకరం.

ఏమైనా హేతువాద ఉద్యమం ఏ ఒకరి సొత్తూకాదు; సంఘం ఏ ఒకరి గుత్త సంస్థకాదు. సుహృద్భావంతో, సహనశీలతతో సహకారభావంతో సంఘ పెద్దలు వ్యవహరిస్తేనే ఉద్యమానికి ఉన్న ఉజ్జ్వల భవిష్యత్తు వాస్తవ రూపం దాలుస్తుంది.

గమనిక :- చరిత్రవ్రాయటంలో ఎంతశ్రద్ధ చూపినా కొన్ని సంఘటనలు, కొందరి పేర్లు జారిపోయి ఉండవచ్చును. ఎవరూ అన్యథా భావించరాదు.

రచయిత

# ఆం. ప్ర. హేతువాద సంఘం కార్యనిర్వాహకవర్గ తీర్మానాలు

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ కార్యవర్గం ది 21-3-82న రాజమండ్రిలో సంఘాధ్యక్షులు శ్రీ రావిపూడి వెంకటాద్రి అధ్యక్షతన సమావేశమై ఈ క్రింది తీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించింది.

## తీర్మానాలు : ప్రధాన కార్యదర్శి తొలగింపు.

1. అధ్యక్షుని ఎరుక, సమ్మతిలేకుండా కార్యనిర్వాహక కార్యదర్శిని లక్ష్యపెట్టకుండా తాను కార్యవర్గ సమావేశాలు ఏర్పరచి భారత హేతువాద సంఘ నియమావళిలో ఉద్యమలక్ష్యాలు అవసరములు స్పష్టీకరించబడినను తాను ప్రత్యేకమైన ప్రణాళికను తయారుచేసి దాని ప్రతిని ముందుగా సభ్యులకు అందజేయకుండ ప్రవేశపెట్టుటకు ప్రయత్నించి, గుడివాడ చర్చ విషయముపై తాను విడుదలచేసిన కరపత్రంలో పోటీసంఘం ఏర్పడినట్లు అర్థం వచ్చేలా వ్యవహరించి, ఈ సందర్భంతో అధ్యక్షుని నిందితునిగ వ్యవహరించినందువలనను అనేకానేక సంఘ వ్యతిరేక చర్యలకు పాలుపడిన ప్రధాన కార్యదర్శి శ్రీ కత్తిపద్మారావు ఆ పదవిలో ఉండతగదని ఈ కార్యనిర్వాహక వర్గం అభిప్రాయ పడుతూ అతనిని పదవీ బాధ్యత నుండి తప్పిస్తూ అతని సాధారణ సభ్యత్వం రద్దుచేయడమైనది.

## శ్రీ ఎస్. వి. రావుపై చర్య.

2. ది 28-2-82 న గుంటూరులో శ్రీ కత్తిపద్మారావు జరిపించిన సమావేశం చెల్లదగినది కాదని తెలిసికూడ దానికి అధ్యక్షత వహించి హేతువాద

సంఘంలో విచ్ఛిన్నకర ధోరణులను, మతాతత్వాన్ని ప్రోత్సహించిన శ్రీ ఎస్. వి. రావుగారిని ఉపాధ్యక్ష పదవినుండి తొలగించి వారి సాధారణ సభ్యత్వం రద్దుచేయడమైనది.

## శ్రీమతి సావిత్రిగారి రాజీనామా.

3. రాష్ట్ర హేతువాద సంఘ కార్యవర్గానికి శ్రీమతి సావిత్రి రాజీనామాను ఆమోదించడమైనది.

## మూఢ విశ్వాస నిర్మూలన సంఘటన.

4. మతశక్తుల విజృంభణ పెరుగుతున్నందుననూ, మూఢవిశ్వాసాల ప్రాబల్యాన్ని స్వప్రయోజన పరులు అంధ విశ్వాసులు పెంచుతున్నందున ఈ ధోరణిని అరికట్టేనిమిత్తం సంఘటనా శక్తిని రాష్ట్రంలోని హేతువాద నాస్తిక వాద సంఘాలతో నిర్మించుటకు, ఈ సంఘం తీర్మానిస్తూ ఈ సందర్భంగా తీసుకోవలసిన చర్చలు తీసుకునే అధికారం అధ్యక్షులకు ఇస్తూ ఈ సంఘటనా శక్తి నిర్మాణానికి అవసరమైన సౌహార్ధభావనను పెంపొందించ వలసినదిగా రాష్ట్రంలోని హేతువాదులకు, నాస్తికులకు, స్వేచ్ఛా భావులకు విజ్ఞప్తి చేయడ మైనది.

## సత్య సాయిబాబా విశ్వవిద్యాలయం.

5. పుట్టపర్తిలో ఉన్న సత్యసాయిబాబా డిగ్రీ కాలేజిని, మామూలు నిబంధనలను త్రోసిరాజని, సరాసరి విశ్వవిద్యాలయంగా ఏర్పరచుట విద్యా సంస్కృతి ప్రమాణాలకు భంగకరమని ఈ సంఘంవారు అభిప్రాయ పడుచున్నారు. గారడీచేసే వ్యక్తిపేర విద్యాసంస్కృతులను పెంచవలసిన విశ్వవిద్యాలయాన్ని స్థాపించటం నైతికంగా గర్హనీయం. రాజ్యాంగంలో విధులుగా పేర్కొనబడిన శాస్త్రీయభావన. సత్యాన్వేషణ, మానవత ఇత్యాది మౌలిక సూత్రాలకు భిన్నంగా ఒకమోసగానిపేర విశ్వవిద్యాలయ స్థాపన జరపటం ఖండించతగినది. ఈ సందర్భంగా కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల చర్యలను ఈ

సమావేశం నిరసిస్తూ ప్రభుత్వం మతశక్తులను ప్రోత్సహిస్తున్న ధోరణికి వ్యతిరేకంగా ఆందోళన చేయవలసినదిగా ప్రజానీకాన్ని ఈ సమావేశం అర్థిస్తున్నది.

## మత మార్పిడులు.

6. మతం ప్రజానీకవు ప్రయోజనాలకు అనుగుణమైనది కాదనే, హేతువాద ఉద్యమమౌలికసూత్రాన్ని ఈ సమావేశం పునరుద్ఘాటిస్తూ, ఏ మతంలో నైనా విశ్వాసం కలిగి ఉండటానికి మతవిశ్వాసాన్ని కాదని జీవించడానికి ప్రతివ్యక్తికి హక్కు ఉన్న విషయాన్ని అంగీకరిస్తూ మతం మార్పిడుల విషయమై హిందూ మతంలో కొన్ని వర్గాలు ఆందోళన చేస్తూఉన్న ఫలితంగాను తత్ ఫలితంగా వచ్చిన ఇతర మతాలవారి ప్రతిచర్య వల్లనూ ప్రజాశాంతికి భంగంగా మత కల్లోలాలు జరగడం ఈ సమావేశం గుర్తిస్తూ ఉన్నది. ఇటీవల విజృంభిస్తున్న హిందూ మహమ్మదీయ క్రైస్తవ మతోద్ధరణ శక్తులవల్ల సంభవించే ప్రమాదాన్ని గమనించవలసినది గానూ, వీటిని అరికట్టేచర్యలకు పూనుకోవలసినదిగా ప్రజానీకాన్ని కోరుతూ వాస్తవమయిన సెక్యులర్ దృక్పథాన్ని చేపట్టడం అవసరమని ఈ సమావేశం ప్రజానీకాన్ని హెచ్చరిస్తున్నారు.

## కార్యనిర్వాహక కార్యదర్శి ప్రకటన.

సభ్యత్వ పుస్తకాలను తీసుకొన్నవారు ఇప్పటిదాకే పూర్తి అయిన సభ్యత్వ వివరాలనూ సభ్యత్వ రుసుంలో 25% స్థానిక సంఘానికి, 25% జిల్లా సంఘానికి, మిగిలిన 50% రాష్ట్రసంఘానికి వెంటనే పంపవలసినదిగా కోరుచున్నాను.

# ఒక మాట

—ఎం.వి. రామమూర్తి

రంగనాయకమ్మగారు నవలా రచయితగా చదువరులకు పరిచయమై సిద్ధాంత భాష్యకర్తగా రూపొందాలని ప్రయత్నిస్తున్నారు. కనుకనే శిల్పానికి తావుండే సాహిత్యాన్ని వదలి ప్రచార సాహిత్యాన్ని సృష్టించ పూనుకున్నారు. అది వారి స్వంత విషయం; వారి శక్తి సామర్థ్యాల మీద ఆధారపడిన అంశం.

పేరు ప్రఖ్యాతులున్న రచయితగా వారి రచనలకు కొంత వ్యాప్తి రావడం సహజం. అణగారిన స్త్రీ లోకంలో జబ్బచరిచి సంప్రదాయం మీద కుస్తీకి దిగే మహిళలు కొద్ది సంఖ్యలో ఉంటారు. అందులోనూ రచనలో ధారకలవారు అరుదుగా ఉంటారు. అట్టి వారిలో రంగనాయకమ్మగారు ఒకరు.

1980లో రంగనాయకమ్మగారు "నాస్తిక వాదం" హేతువాదం, నవ్య మానవ వాదం, అనే శీర్షికతో ఒక 87 పేజీల పుస్తక ప్రచురణ చేశారు. క్రౌన్ సైజులో ఉన్న ఆ పుస్తకంలో 3 పేజీలు హేతువాదం పైన 13 పేజీలు రాడికల్ హ్యూమనిజం పైన వ్రాశారు. ఈ రెండు వ్యాసాలను గురించి కొంతగా కొంత పట్టించుకోవలసిన అవసరముందని మిత్రులు అభిప్రాయ పడుతున్నారు. వారి కోరికను మన్నించే ఈ చిన్న వ్యాసం వ్రాయడం సంభవిస్తున్నది.

"నాస్తిక వాదం" అనే శీర్షిక క్రింద గోరాగారి నాస్తికవాదాన్ని రంగనాయకమ్మగారు విమర్శించారు. గోరాగారి నాస్తికవాదం ఏయే అంశాలలో ఆధార రహితమో మిత్రుడు రావిపూడి వెంకటాద్రి వ్రాసిన 'నాస్తికత్వం: నాస్తి తత్వం' అనే 160 డెమ్మీ పేజీల గ్రంధాన్ని చదివితే బోధపడుతుంది.

ఇక మిత్రుడు సి. వి. పై రంగనాయకమ్మగారు చేసిన విమర్శకు వారు సమాధానం ఇచ్చారు. విమర్శ ప్రతి విమర్శలు సాగినవి. మార్క్సిజం ఆధారంగా ఉండే నాస్తికవాదానికి రంగనాయకమ్మగారి భావాలకు ఉండే ఘర్షణ అది. దాంతో యీ రచయితకు నిమిత్తంలేదు.

హేతువాద ఉద్యమంలోనూ, రాడికల్ హ్యూమనిష్టు ఉద్యమంలోనూ, బాధ్యతగల సంచాలకునిగా, కార్యకర్తగా హేతువాదంపైన, నవ్యమానవ వాదంపైన రంగనాయకమ్మగారు వేసిన విసుర్ల వరకే యీ రచయిత తన దృష్టిని పరిమితం చేసుకోదలచాడు.

1) పరిశోధనా వ్యాసానికి (Thesis) మామూలు వ్యాసానికి తేడా ఉంది. ఇతరుల రచనలలోని వాక్యాలు సందర్భోచితంగా ఉటంకించి పేజీల సంఖ్యతో సహా వివరణ ఇచ్చి హేతుబద్ధంగా రచన సాగించటం ఒక ఎత్తు. సందర్భశుద్ధి లేకుండా కొన్ని వాక్యాలను వెలికితీసి వాటిని మన మాటలలో చెప్పి, అతిగా క్లుప్తీకరణచేసి (Over Simplify) విమర్శించ పూనడం మరోఎత్తు, ఈ రెండవ పద్ధతిని అవలంబించారు రంగనాయకమ్మగారు. మొదటి పద్ధతి బహుశః వారి దృష్టిలో బూర్జువా సాంప్రదాయమేమో !

ఎం. ఎన్. రాయ్ రచనలలో ముఖ్యంగా వారి దృష్టి నాకర్షించినవి "హ్యూమనిస్టు రాజకీయాలు", "రాడికల్ హ్యూమనిజం : తాత్విక సిద్ధాంతం, ఆచరణ, అనే ఉపన్యాస పాఠాలు. ఇవి చాల చిన్న పొత్తాలు. ఎం.ఎన్. రాయ్ రచించిన 'Beyond Communism' 'New Humanism' 'Parties Power and Politcs, 'Reason, Romanticsm and Revolution (2Vols) అనే ప్రామాణిక గ్రంథాలు బహుశః రంగనాయకమ్మగారికి అందుబాటులోనికి రాలేదేమో ! వాటిని వారు చదవటం తటస్థిస్తే వారు వాటిలో నుండి కొన్ని వాక్యాలను (సందర్భోచితంగా కాకపోయినా) ఉటంకించి ఉండేవారు. ఏదైనా సాహసానికి మారుపేరు రంగనాయకమ్మగారు.

రంగనాయకమ్మగారి (కు) విమర్శలకు సమాధానంగా మాత్రమే కాకుండా హేతువాద సారాన్ని పాఠకులకు ఎరుక పరచే ప్రయత్నమే ఈ కరపత్రం.

# హేతువాదం

హేతువాదం ఒక సిద్ధాంతం కాదు. రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక భావాల సంపుటీకరణం కాదు. భావాల వ్యవస్థీకరణ కాదు. అది ఒక మానసిక వైఖరి; అది ఒక దృక్పథం. ప్రకృతిలో, సమాజంలో జరిగే ప్రతి సంఘటన వెనుక, ప్రతివ్యక్తియొక్క ఆలోచనా సరళి, చర్యల వెనుక ఏదో ఒక కారణంగాని కొన్ని కారణాలుగాని ఉంటాయని హేతువాదం ప్రతిపాదిస్తుంది. జగత్తులో కనపడే నియమం కార్య కార్యకరణతగా (Causality) గుర్తిస్తుంది. వాస్తవ ప్రపంచాన్ని తెలుసుకోడానికి శాస్త్రీయ దృక్పథాన్ని చేపడుతుంది. సైన్సు పనిచేసే తీరును ఆమోదిస్తుంది. ఆ విధానాన్ని ప్రాపంచిక వ్యవహారాలకు అన్నింటికీ అన్వయించాలని కృషిచేస్తుంది. తర్కం, అనుభవంల పై సైన్సు ఆధారపడటం మనందరికి తెలుసు. ఒక ఊహాధారాన్ని ప్రతిపాదించి ప్రయోగంవల్లకాని, జీవితానుభవంవల్ల కాని అది ఎంతవరకు రుజువు అవుతుందో గమనిస్తుంది సైన్సు. రుజువు అయిన విషయాన్నే స్వీకరిస్తుంది. శాస్త్రానికి (Science) దేశపు ఎల్లలు లేవు. అది అంతర్జాతీయం. బ్రిటిషు సైన్సు, అమెరికను సైన్సు, రష్యను సైన్సు అని లేవు. ఒక సూత్రాన్ని ఒక శాస్త్రజ్ఞుడు ప్రతిపాదిస్తే శాస్త్రజ్ఞులు అందరూ ఏ దేశంలో నివాసముంటున్నా ప్రయోగాలు చేసి దాని నిగ్గు తేలుస్తారు. మెజారిటీ, మైనారిటీల అభిప్రాయం ప్రకారం శాస్త్రం పురోగమించదు! శాస్త్రజ్ఞులందరి ఆమోదం పొందితేనే ఒక సూత్రాన్ని శాస్త్రీయ సత్యంగా (Scientific Truth) అంగీకరించటం జరుగుతుంది. వాస్తవాన్ని గురించిన జ్ఞానాన్ని సముపార్జన చేస్తాం. జ్ఞాన విషయమే సత్యం. మన జ్ఞానం పెరుగుతున్నకొలదీ కొన్ని శాస్త్రీయ సత్యాలను సవరణ చేసుకోవలసి రావచ్చును. అలా చేసుకోలేనివాడు హేతువాది కానేరడు. తేలిందేమంటే శాస్త్రీయ దృష్టి హేతువాదానికి జీవగర్ర.

హేతువాద దృష్టిలో ఏ ఒక్క మతగ్రంథం కాని, ఏ ఒక్క ప్రవక్త ప్రవచనాలుగాని పరమం కావు. అట్లే ఏ ఒక మహావ్యక్తినీ ఆరాధించదు. అతను చేసిన సూత్రీకరణలను ప్రశ్నించవీలులేనివిగా అంగీకరించదు. ఆయా దేశ కాల పరిస్థితులలో ఆ మహావ్యక్తులు తమకు తోచినట్లు, తమకు అందుబాటులో ఉన్న జ్ఞానాన్ని ఆసరాగా తీసుకొని కొన్ని సిద్ధాంతాలను ప్రతిపాదించి ఉండవచ్చును. అవి సార్వకాలికంగా సత్యాలుగా ఉండిపోతాయని భావించడం వీరారాధన అవుతుంది.

హేతుత్వం యొక్క ఉత్కృష్టతను హేతువాదం ఆమోదిస్తుంది. హేతుత్వం (Rationality) మానవునికి ఉన్న విలక్షణమైన శక్తి. మానవునికి పశువుకు ఉన్న తేడా అల్లా మానవునిలో ఉన్న హేతుత్వమే అతడు ఆలోచనా జీవి. విషయాలను పరిశీలిస్తాడు వాటి వెనుక నున్న కార్యకారణ నియమాన్ని గుర్తిస్తాడు. ఆలోచిస్తాడు. ఊహిస్తాడు. తన ఊహలకు ఆధారముందో లేదో తరచి చూసుకుంటాడు. నిర్ణయాలు చేస్తాడు. వాటిని అమలుపరుస్తాడు. భాష ద్వారా తన తోటివారికి తన మనోగత భావాలను తెలియజేస్తాడు. తన పరిస్థితిని బాగుచేసుకోవటానికి సాధనాలను (Tools) తయారుచేసుకుంటాడు. వాటిని, తన భావాలను, తను నిర్మించిన వ్యవస్థను, సంస్కృతిని ముందు తరాలకు అందజేస్తాడు. తన వ్యక్తిగతమైన మనుగడ తోటివారి సహకారంపై ఆధారపడియున్నదని గ్రహిస్తాడు. అతడు సమాజ జీవిగా సహకార సూత్రం మీద తన జీవితాన్ని గడుపుకోవాలని అభిలషిస్తాడు. అలాంటి సహకార వ్యవస్థ లోనే తానాశించే వ్యక్తి స్వేచ్ఛను పొందగలనని అతడికి తెలుసు. ఉదాహరణకు అతడు చలిచేత బాధపడుతున్నాడు అనుకుందాము. చలినుండి విముక్తికి దుస్తులు ఉపకరిస్తాయని గ్రహిస్తాడు. ఆ దుస్తులను సమిష్టి ప్రయత్న ఫలితంగా తయారు చేస్తే తన అవసరం తీరుతుందనే సత్యాన్ని గమనిస్తాడు.

అంటే చలినుండి విముక్తి పొందటానికి చలి ఎలా పోతుందో తెలుసు కొని, ఆ సత్యాన్ని ఆధారంగా చేసుకొని సహకార కృషివల్ల కృతకృత్యుడవు దాడు. ఈ ప్రక్రియలో అతడు హేతువాదిగా సంచరిస్తాడు. అతనిలో హేతుత్వం ఎక్కడనుంచో వచ్చిన శక్తిగాని, ప్రజ్ఞకాని కాదు. అది ప్రాయికం.

అతని ఉనికికి శక్తి అని అతనిలో ఉంచి వచ్చింది. ప్రకృతిలో నియమం కన్పిస్తు తున్నది కదా! ఆ నియమమే మానవునిలో హేతుత్వంగా భాసిల్లుతుంది.

హేతువాద వైఖరి అంటే అదేదో తాత్విక విషయంగా పరిగణించవ నక్కరలేదు. 'పరిశీలించు, ఆలోచించు, నిర్ణయించు ఆ నిర్ణయాన్ని అమలు పరుచు' అని చెప్పేదే హేతువాదం.

ఒకప్పుడు హేతువాదం మతపరమైన జ్ఞానపు పరిమితులను విమర్శిం చింది. ఉధృతంగా మతంపై దాడిచేసింది. కాని తరువాత మతం చేతిలో దెబ్బ తిన్నది. మానవుని హేతుత్వ స్వభావాన్ని నిర్దేశించలేకపోవటం వల్ల ఈ పరిస్థితి అపుడు కలిగింది. మానవునిలోని హేతుత్వం అఖండమైన దైవస్వరూపంలో భాగంగా మతస్తులు పేర్కొన్నారు. పరమాత్మ అవస్థాభేదం చేత జీవాత్మగా పేర్కొనబడిందన్నారు మతస్తులు. తర్వాత జీవశాస్త్ర పరిశోధనల ఫలితంగా హేతుత్వ స్వరూప నిర్వచనం తేలికయింది. దాంతో దైవభావన అనే ఊహా ధారం (Hypothesis) అనవసరమయింది. హేతువాదంలోని ఒకనాటి బలహీనత తొలగిపోయింది.

హేతువాదం లోపభూయిష్టమని కొందరు విమర్శిస్తారు. కార్యకారణ సూత్రాన్ని ఆమోదిస్తే భగవంతుని ఉనికిని అంగీకరించవలసి వస్తుందని వారి భయం. ఈ వాదనలో ఒక లోపం ఉన్నది భగవంతుని మూల కారణంగా అంగీకరిస్తే ఆ భగవంతునికి మూలకారణ మేది అనే ప్రశ్న ఉదయించదా ! మతస్తులు అలాంటి ప్రశ్న వేయరాదంటారు. ప్రశ్న అక్కడ ఎందుకు ఆగిపో వాల్సి వచ్చింది, ప్రకృతితోనే ఆ ప్రశ్నను నిలుపుదల చేయించవచ్చుకదా అని భౌతికవాదులు ఎదురు జవాబుచెప్తారు. ప్రకృతి జడ స్వరూపం కనుక చైతన్యం దాని వెలుపల ఉండాల్సి ఉంటుందని మత తాత్వికుల భావం. కాని శాస్త్రీయ జ్ఞానం మనకు తెలిపింది ఏమంటే పదార్థం చైతన్యం వేరుకావని; అవి స్వరూప భేదాలు; మరోరకంగాచెప్తే అవస్థా భేదాలు. ఒక పరిస్థితిలో అది పదార్థము మరియొక పరిస్థితిలో అది చైతన్యం. కనుక పూర్వం మనం వాడుతున్నట్లు పదార్థము చైతన్యమూ వేరువేరుగా భావించ వీలుకాదు.

హేతువాది అహంకారికాదు. అంతా తనకు తెలుసునని బుకాయించడు. తనకు తెలియని విషయాలెన్నో ఉన్నాయని అంగీకరిస్తాడు. అయితే నిన్న మొన్న తెలియని విషయాలు ఈ రోజు తను తెలుసుకొనగల్గానని గమనించి అలాగే ఈనాడు తనకు తెలియని విషయాలు మున్ముందు తనకు అవగతం కాగలవని పూర్వానుభవం వల్ల విశ్వసిస్తాడు. ప్రకృతి ఎందుకు ఉన్నది ? దానిని ఎవరు సృష్టించారు ? అనే ప్రశ్నలు వేసుకోడు ప్రకృతి ఎలా ఉన్నది, దాని శక్తులను తన కనుగుణంగా ఎలా వాడుకోవాలనే విషయంపై దృష్టి సారిస్తాడు. అతడు వాస్తవిక దృక్పథం కలవాడు. భూమిని విడిచి ఊహాలోకంలో విహరించడు. తన చుట్టూ ఉన్న ప్రకృతి తన జీవితాన్ని కొంతవరకు నిర్ణయిస్తుందని అంగీకరిస్తాడు. కాని తనకు చేతనయినంతవరకు మార్చుకొని సుఖపడటానికి ప్రయత్నిస్తాడు అంతే ఏ సమాజంలో తను భాగమో ఆ సమాజం తన జీవితాన్ని కొంతగాకొంత నిర్ణయిస్తుందని అంగీకరిస్తాడు. కాని ఆ సమాజాన్ని కూడ మార్చగల సత్తా తనకు ఉన్నదని అతనికి తెలుసు. ఆ శక్తిని వాడతాడు తన ఆనంద ప్రాప్తికోసం. అదే అతని స్వేచ్ఛ.

హేతువాదికి పురుష ప్రయత్నంలో నమ్మకముంటుంది. తనచుట్టూ ఉన్న ప్రాకృతిక పరిసరాలను, సమాజ స్థితిగతులను గమనించి ఎంతగా వాటిని తన కనుకూలంగా మార్చగలడో ఆలోచించి మార్గాలను అన్వేషించి తన లక్ష్యసిద్ధిని పొందుతాడు; వీలయినంత వరకు తన ప్రయత్నంలో విజయం పొందుతాడు. నిరాశతో క్రుంగిపోడు; ఊహాలోకంలో విహరించడు. వాస్తవ పరిస్థితులను గమనించి ప్రవర్తిస్తాడు.

ఒక సంఘటనను, ఒక దృశ్యాన్ని చూడటం తటస్థిస్తే "ఇది ఎందుకు జరిగింది" అని ప్రశ్నిస్తాడు. కారణాలను అన్వేషిస్తాడు. అది అవాంఛనీయమైన సంఘటన అయితే అలాంటివి మరల జరగకుండా జాగ్రత్త పడతాడు. అది ఆనంద దాయకమైతే అలాంటి సంఘటన ఇతోధిక సంతోషాన్ని చేకూర్చే విధంగా మరల జరగాలని కోరుకొని దానికోసం ప్రయత్నిస్తాడు.

ఇంతకూ దేనినీ గ్రుడ్డిగా నమ్మడు. తెలియని దానికి 'దైవం' అని పేరు పెట్టి దానికి లొంగిపోయి బానిస బ్రతుకు జీవించడు. దేవదూతలు, దైవ ప్రతి

నీతులు, ప్రవక్తలు అతని చేత గౌరవించబడరు. వారి బెదిరింపులకు అతను అదిరిపోడు. వారి శాపనార్థాలకు భీతి చెందడు. అలాగే సామాజిక శక్తుల అది రింపులకు వెరగొందడు. వాటి చేతిలో తను ఒక కొరముట్టుగా ఉండటానికి ఇచ్చగించడు. మానవుల సుఖ సంతోషాల కోసం, భద్రత కోసం అనేక దశల ద్వారా పరిణామం చెందిన సమాజం మానవుల సముదాయమనే గ్రహిస్తాడు. కనుక సమాజ గత శక్తులను తాను వ్యష్టిగా గాని సమష్టిగా గాని అదుపులోనికి తేగలననే ఆత్మ విశ్వాసం అతనికి ఉంటుంది.

హ్యూమనిస్టు కాని మార్క్సిస్టు కాని హేతువాదిగా చలామణి కావచ్చును. కాకపోతే ఎం.ఎన్.రాయ్‌ని కాని మార్క్సుని కాని ప్రవక్తగానో దైవసమానుడిగానో భావించేవారు హేతువాదులు కానేరరు. సిద్ధాంత కర్తలు యుగపురుషులు. ఆ కాలంలో ఉన్న జ్ఞాన భాండాగారాన్ని మథించి వారు విశ్వజన శ్రేయస్సును కాంక్షించి సిద్ధాంతాలను ప్రతిపాదించారు. కొంత కాలానికి మరింత జ్ఞానాభివృద్ధి జరిగితే వారి సిద్ధాంతాలను సవరించవలసి రావచ్చును, వారు మార్గదర్శకులు. అంతకన్నా యెక్కువగా వారిని భావిస్తే అది గుడ్డి నమ్మకం క్రింద పరిణమిస్తుంది,

హేతువాదానికి కల రాజకీయ ఆర్థిక కార్యక్రమాలు ఏమిటి అని పలువురు ప్రశ్నిస్తారు. హేతువాదం ఒక సిద్ధాంతం కాదని మనం చెప్పుకున్నపుడు దానికి రాజకీయ ఆర్థిక కార్యక్రమం అంటూ ఒకటి ఉండదు. అంత మాత్రాన హేతువాదులకు రాజకీయ ఆర్థిక కార్యక్రమాలు ఉండవని భావించరాదు. హేతువాదులు పలు తెరగుల సిద్ధాంతాలను ఆమోదించేవారుగా ఉండవచ్చని ఇందాక చెప్పుకున్నాము కదా ! కాగా మార్క్సిస్టు అయిన హేతువాదికి ఒక రకమైన రాజకీయ ఆర్థిక కార్యక్రమం, హ్యూమనిస్టు అయిన హేతువాదికి మరొక రకమైన రాజకీయ ఆర్థిక కార్యక్రమం ఉండవచ్చును. వారిద్దరికీ సామ్యము హేతువాద వైఖరిలోనే.

ఇక్కడ ఒక విషయం స్పష్టం చేయవలసి ఉన్నది. హేతువాదులు ఒక సంఘంలో సమీకృతమయి అఖిల భారత హేతువాద సంఘాన్ని నిర్మించుకున్నారు. రాజకీయ ఆర్థిక విషయాలపై పెక్కు అభిప్రాయభేదాలకు అవకాశము

ఉన్నది కనుక అఖిల భారత హేతువాద సంఘం ప్రత్యక్షంగా రాజకీయ ఆర్థిక విషయాలలో జోక్యం కలుగజేసుకోరాదని అన్ని రకాల హేతువాదులు ఎంతగానో ఆలోచించి నిర్ణయాలు చేసుకున్నారు. అందువల్ల హేతువాద సంఘాల తీర్మానాల్లో రాజకీయ ఆర్థిక విషయాలు ప్రముఖ స్థానంలో కన్పించవు : మతవాదుల విజృంభణ, సంప్రదాయ శక్తుల బలప్రదర్శన విరివిగా ఉన్న ఈ సమాజంలో హేతువాదులు మతస్థులను సంప్రదాయవాదులను సమిష్టిగా ఐక్యతతో ఎదుర్కొనే నిమిత్తంవారు ఏర్పరుచుకున్న నియమం అది; వారి సంయమనానికి నిదర్శనం. ఈ విషయాన్ని సరిగా అవగాహన చేసుకుంటే ఇది హేతువాద ఉద్యమంయొక్క విజ్ఞతగా గ్రహిస్తారు; అలా కానినాడు హేతువాదాన్ని అపార్థం చేసుకోవడం జరుగుతుంది.

'హేతువాదంవల్ల పేదవానికి ఒరిగే మేలు ఏమిటి?' అని కొందరు ప్రశ్నిస్తారు. రూపాయి పైసలలో లాభం కన్పడకపోవచ్చును. ఉదాహరణకు పేదవాడు 'నివసించే పేటలో ఒక కుళాయిలో మంచినీరు రావటం లేదనుకోండి. హేతువాది కాని పేదవాడు ఇదంతా తన కర్మ ఫలమని ఊరుకుంటాడు. హేతువాదియైన పేద కార్మికుడు అలా స్తబ్దుగా ఉండడు. తన పేటలో నీరు ఎందుకు రావటం లేదో కారణాలను తెలిసికుంటాడు. తన ప్రక్క ఇంటిమేడ గల ధనవంతుని కుళాయిలో ఎందుకు నీరు వస్తున్నదో వాకబు చేస్తాడు. మున్సిపలు సిబ్బంది అసమర్థతో లంచగొండితనమో లేక ప్రభుత్వంయొక్క ఉదాసీనతయో తెల్సుకుంటాడు. దానికి విరుగుడుకోసం ఆలోచిస్తాడు. తనొక్కడూ పరిస్థితిని మార్చలేకపోతే తన ఇరుగు పొరుగువారిని సంఘటితం చేస్తాడు. సంఘశక్తి ద్వారా పరిస్థితిని మార్చటానికి ప్రయత్నిస్తాడు. అతని జయాపజయాలు అనేక పరిస్థితులపై ఆధారపడవచ్చును. జయమూ, అపజయమూ ప్రధానం కావు. పరిస్థితిని మార్చచూచే ప్రయత్నం ముఖ్యం. దానికి దోహదంచేసేది హేతువాదం.

ఇటీవల చాలమంది గందరగోళంగా వ్రాస్తున్నారు. విషయాలను కలగాపులగం చేస్తున్నారు. భాషకు ప్రాధాన్యత ఉందని వారు గ్రహించడం లేదు. ప్రతి పదానికి ఉత్పత్తి అర్థం, చారిత్రక పరిణామంలో మరియొక అర్థం, చివరకు రూఢ్యర్థం వేరు వేరుగా ఉండవచ్చని వారు అర్థం చేసుకోవటం లేదు. అందు

వల్ల అలాంటి వాటికి హేతువాదం, అజ్ఞేయవాదం, నాస్తికవాదం మూడూ ఒకటి గానే కన్పడతాయి. ఇది చాల శోచనీయం.

హేతువాదం విషయం కొంతగా కొంత ముచ్చటించుకున్నాం. ఇక **అజ్ఞేయవాదం** (Agnositcisn) విషయం పరిశీలించాలి. తెలిసికొన్నవాడు జ్ఞాత; తెలిసికోనివాడు అజ్ఞేయవాది. ఏమిటి తెలిసి కోవడం? దైవం యొక్క ఉనికిని తెలుసుకోవడం. ఇది ఉత్పత్తి అర్థంగా వచ్చింది. కాగా పరిణామం చెందింది ఆ భావం. "దేవుడు ఉన్నాడో లేడో నాకు అనవసరం. నేను నీతిగా రుజుమార్గ వర్తనంతో జీవించడం నాకు ముఖ్యం." అనే వాళ్లు అజ్ఞేయవాదులుగా చలామణి అయ్యారు. కానీ ఇటీవల మరో అర్థం రూఢ్యర్థంగా ఏర్పడింది. మనం తెలిసికోజాలనిది చాల ఉంది; తెలిసికున్నా మనకోవడం భ్రమ. ఈ అర్థంలో యీ పదాన్ని ఏ తాత్త్వికులు వాడటం లేదు; కాగా సామాన్యులు వాడుతున్నారు.

దేవుని ఉనికిని తార్కికంగా రుజువుచేయవచ్చని సవాలుచేస్తున్న మతస్థులకు భిన్నంగా నిస్సందేహంగా రుజువుచేసే సాక్ష్యమున్న దానినే విశ్వసించాలని ప్రకటించిన టి. హెచ్. హక్స్లీ మొదట్లో అజ్ఞేయవాదం (Agnosticism) అనే పదాన్ని వాడాడు. దానినే లెస్లీ స్టీఫెను మరింతగా వివరించాడు. 'విశ్వం యొక్క స్వభావము, లేక దేవునియొక్క ఉనికి మొదలగు విషయాలను గురించి మానవునికి తెలియదు అని చెప్పడం నేరమా' అని ప్రశ్నించాడు స్టీఫెన్. నాస్తికుడు అనే పదంతో తమల్ని పిలుచుకుంటే ప్రమాదమని ఇలా అభివర్ణించుకున్నారని కొంతమంది వారిని విమర్శ చేశారు.

నాస్తికత్వాన్ని గురించి ఆలోచిస్తే భారతదేశంలో 'నాస్తికో వేద నిందకః' అన్నారు. వేద ప్రామాణ్యాన్ని అంగీకరించనివాడు నాస్తికుడు. రూఢ్యర్థంగా నిరీశ్వరవాదిని నాస్తికుడనటం జరిగింది. అనంతశక్తిలో విశ్వాసం కలిగి, జాతి ఆనాడు ఆరాధించే దేవతలను నమ్మనివారిని యూరపులో నాస్తికులని నిందించారు. అది నిందావాచకమయింది. నాస్తికుడు (Atheist) అంటే ఆస్తికుడు కానివాడు (Who is not a theist). నాస్తికులు రెండు రకాలవారు. పాజిటివ్ అథియిస్టులు (Positive Atheists) దేవుడు లేడేలేడని పీరు వాది

స్తారు. నెగేటివ్ ఎథియిస్టులు (Negative Atheists) "దేవుడున్నాడని మేము అంగీకరించం" అంటారు వీరు. ఎవరయితే ఏ విషయాన్ని ఉద్ఘాటిస్తారో వారు దానిని రుజువు చేయవలసి ఉంటుంది. కనుక దేవుడు లేడని వాదించేవారు. 'దేవునికి ఉనికి లేదు' అనే విషయాన్ని రుజువుచేయవలసి ఉంటుంది. కాగా రెండో రకపు నాస్తికులకు ఆ ఇబ్బంది ఉండదు. రుజువు భారం వారు ఆస్తికుల పైకి నెట్టున్నారు. 'దేవుడు ఉన్నాడు' అనే అంశాన్ని ఆస్తికులు రుజువు చేయాల్సి ఉంటుంది. ఇది అచ్చంగా రుజువు కోసం సంబంధించిన సౌకర్యమే కాదు. ఇది తాత్విక విషయంగా కూడ గ్రహించాలి. మనకు తెలియని దానిని నిర్వచనం చేసి స్పష్టీకరించి దానికి ఉనికిలేదని రుజువు చేయబూనటం అర్థ రహితం కదా!

'మనదేశంలో నాస్తికులున్నారు. విప్లవ నాస్తికులున్నారు. పాజిటివ్ నాస్తికులున్నారు. వీర నాస్తికులున్నారు. ఈ సమాజంలో ఉన్న దోపిడీని (Exploitation : ఈ పదం లోపభూయిష్టమైనది; అయినా వాడుకలోనికి వచ్చింది) పోగొట్టటానికి కృషిచేసే నాస్తికులు మాత్రమే విప్లవనాస్తికులు. నిజానికి ఈ పేరుమీదుగా వారు తమల్ని అలా పిలుచుకోవటం లేదు. సౌకర్యం నిమిత్తం మనం అలా పిలువవల్సి వస్తున్నది. పాజిటివు నాస్తికులమని గోరా గారు వారి అనుచరులు పిలుచుకుంటున్నారు. ఇక, రామస్వామి నాయకరు అనుచరులను వీరనాస్తికులుగా పేర్కొనటం అసంజసం కాదేమో.

ఈ సందర్భంలో ఒక అంశం స్పష్టీకరించవలసిఉన్నది. నాస్తికులందరూ హేతువాదులు కారు. "దేవుడులేడు; లేనేలేడు" అని గట్టిగా ఎలుగెత్తి అరవడమే తమ విధ్యుక్త కర్తవ్యంగా పెట్టుకున్న నాస్తికులందరికీ కార్యకారణ నియమంలో కాని జగత్తుయొక్క నియమబద్ధతతో గాని మానవుని హేతుత్వం (Rationality) లో గాని విశ్వాసం ఉండకపోవచ్చును. చాలమందికి లేదు కూడాను. కనుకనే కొందరు పాజిటివు ఎథియిస్టులు (Positive Atheists) హేతువాదం లోపభూయిష్టమని వ్రాశారు (ఉదా॥ గోరా గారు) మరొక విషయం గమనించాలి. ఇప్పటికీ హేతువాదులుగాఉన్న చాలమంది విజ్ఞాన శాస్త్రవేత్తలు తమను అజ్ఞేయవాదులుగా (Agnostics) - ఉత్పత్తి అర్థంలో సుమండీ-అభి

వర్ణించుకుంటున్నారు. అంటే ఉత్పత్తి పర్వంలో అజ్ఞేయవాదులకు (Agnostics) కు నెగిటివ్ ఎథీయిస్టులకు (Negativh Atheists) కు అస్తి లేదా లేదని తేలింది. ఈ కొద్దిపాటి వివరణలో రంగనాయకమ్మగారి విమర్శ ఎంత వరకు సమంజసమో మనం పరిశీలించవచ్చును.

"ఈ వాదాలు (నాస్తికవాద హేతువాద నవ్యమానవవాదాలు) కలిగించే ప్రకృతి జ్ఞానం చాలా పరిమితమైనది. కొన్ని సందర్భాలలో అది అసలు ఏమీ లేని దానితో సమానం కూడా" (5, 6 పేజీలు)

ఈ వాదాల మధ్యనున్న తేడాలను గమనించకుండా అన్నింటినీ ఒకగాట కట్టివేసి మూకవుమ్మడిగా చేసే విమర్శ ఇది. దీంట్లో గాఢత ఉండదు; సత్యనిరతి అసలేలేదు. హేతువాదం శాస్త్రీయ దృక్పథంపై ఆధార పడింది. శాస్త్రం (Science) ను ఆధారంగా ప్రకృతిని గురించిన జ్ఞానాన్ని సమకూర్చుకుంటుంది. నవ్యమానవవాదం యొక్క మౌలికాంశాలలో హేతువాదం ఒకటి. హేతువాదం, మానవవాదం, వ్యక్తివాదం ఈ మూడూ రాడికల్ హ్యూమనిజానికి మూలస్తంభాలు. అలాంటప్పుడు హేతువాదమూ నవ్యమానవ వాదమూ ప్రకృతిని గురించిన జ్ఞానాన్ని ఏమీ అందించలేకపోవటమేమిటి ? అన దలుచుకొని అనే మాటలు ఇవి: వీటికి ఆధారాలు చూపనవసరం లేదుకదా !

"మానవ సమాజం అంతా ప్రకృతికి సంబంధించిన విషయాలలో పూర్తిగా అజ్ఞానంలో ఉండడంవల్ల ఆ దైవభీతి ఏర్పడింది. కానీ ఆ దైవభీతే మతం కాదు." (పేజీ 16)

"మతం అంటే-ప్రకృతికి సంబంధించిన విషయాలలో అజ్ఞానము + దోపిడీ వర్గానికి ఉపయోగపడే స్వభావమూ" (పేజీ 17)

"ఆ దైవభీతికి కూడా 'మతం' అనే పేరు వుంటే ఉండవచ్చును. అలా ఉండిఉంటే ఆ మతమూ ఇపుడు చెప్పుకునే మతమూ ఒకటికాదు. (పేజీ 17)

"దైవభీతి అనేది-తర్వాత కాలంలో మతంలో ఒకభాగంగా అయ్యిందే కాని, మతం అంటే పూర్తిగా దైవభీతితోనిండిన ఒక విషయమేకాదు' (పేజీ 17)

ఒక పదానికి తప్పుడు అర్థంచెప్పి దానికి సమర్థనగా తికమకపడి నానా హంగామా చేయటం అంటే ఇదే. ఏ నాస్తిక సంఘమూ వారనే అర్థంలో 'నాస్తికత్వం' అనే పదాన్ని డా॥ మిత్రా వాడుతున్నారని (46వ పేజీ) ఆక్షేపించిన రచయిత గారూ ఆ పొరపాటే చేయటంలేదా! "దేవుడనే శక్తి ఉందని నమ్మడం, బాహ్య సృష్టి వంటి సందర్భాలలో కొన్ని కర్మ కాండలు చెయ్యడమూ వంటి లక్షణాలు మాత్రమే ఆ వైదికంలో ఉండేవి." (పేజి 16). ఇది మతంకాక మరేమిటి? ఇలాంటి వైదికాన్ని రచయిత మతమని పిలవడానికి ఇష్టపడటంలేదు. మతం మానవుని అజ్ఞానంతో పుట్టింది. తరువాత స్వప్రయోజనపరులు దానిని తమకు వీలుగా వాడుకున్నారు. ఈ వాస్తవాన్ని గుర్తించక అవకతవక నిర్వచనాలతో చదువరులను గందరగోళంలో ముంచడం న్యాయం కాదు.

"ఏ హేతువాద సంఘమైనా దోపిడీ సంస్కృతిని ప్రతిఘటించే మార్గంలో ప్రయాణం చేస్తోందా ? ప్రకృతి విషయాలను తప్ప సామాజిక విషయాలను అది ఎప్పుడైనా ఆలోచించిందా ? ఆలోచించినా కనీసంగానైనా వాస్తవాన్ని గ్రహించిందా ?" (పేజి 55) ఇవి జ్వాలాముఖిగారిని రచయిత విమర్శించే సందర్భంలో వ్రాసిన వాక్యాలు. కులతత్వాన్ని హేతువాద సంఘాలు ఎదిరించడం లేదా ? కులాంతర మతాంతర వివాహాలను ప్రోత్సహించడం లేదా ? దళిత జాతుల దౌర్జన్యాన్ని నిరసించడం లేదా ? స్త్రీలపై జరిగే హింసను అత్యాచారాలను ఖండించడం లేదా? స్త్రీల యెడ వర్తించే అమానుష ద్వంద్వనీతిని ఈసడించడం లేదా ? స్త్రీల విముక్తికోసం పోరాడడం లేదా ? మతాధికారుల దోపిడీని విమర్శించడం లేదా ? కులం, మతం, స్త్రీలయెడ వివక్ష ఇవన్నీ భారత సంస్కృతిలో భాగాలు కావా ? ఈ సంస్కృతి రూపాలతో పోరాడడం విప్లవ పోరాటంలో భాగం కాదనుకోవటం, కేవలం రాజకీయ ఆర్థిక పోరాటమే అసలయిన విసలయిన పోరాటమని భావించడం పొరపాటవుతుంది. సమ్యక్ దృక్పథం ఉంటే ఇలాంటి విమర్శ దొర్లదు.

"నాస్తికత్వానికి హేతువాదానికి తేడా ఏమిటని చూస్తే నిజానికి ఈనాడు తేడా ఏమీ లేదు...ఈ నాడైతే స్పష్టమైన తేడా ఏమీలేదు?! (పేజీలు 60, 61)

ఇవి 'హేతువాదం' అధ్యాయంలోవి: ఎంత అయోమయం! గోరాగారి పాజిటివ్ నాస్తికవాదాన్ని, మార్క్సిజంతో మిళితమయిన నాస్తికాన్ని, హేతువాదాన్ని అన్నింటినీ ఒక మాటలో కొట్టి పారవేశారు రచయిత. అతిగా క్లుప్తీకరించడం అంటే ఇదే; రావిపూడి వెంకటాద్రి గారి 'నాస్తికత్వం, నాస్తితత్వం' చదవమని రచయితకు ప్రబోధం చెయ్యవలసిన అవసరం ఏర్పడుతున్నది. స్వర్గమూ నరకమూ, పునర్జన్మ, దేవుడు మొదలైన భావాలు, హేతుబద్ధంగా విశ్వాన్ని గురించిన జ్ఞానం అభివృద్ధి అయ్యేకొద్దీ నమసిపోతాయి. అవి "హూష్ కాకి" అంటే ఎగిరిపోవు. సమాజశక్తులపై మానవుడి ఆధిపత్యం పెరుగుతున్న కొలదీ, అతని నిస్సహాయతా భావమూ తరుగుతున్న కొలదీ, అతనికి దైవం అనే ఆసరా అవసరం లేకుండా పోతుంది. చారిత్రిక దృష్టితో కార్య కారణ నియమాన్ని గమనించి ప్రకృతిని సమాజాన్ని అధ్యయనం చేసిన మానవుడు స్వేచ్ఛను ఇతోధికంగా పొందుతాడు. ఇలాంటి పరిణామ క్రమాన్ని గుర్తించకుండా ఏదో వ్రాయాలనే తపనతో (Compulsion) వ్రాయడం మంచి లక్షణం కాదు.

"సమాజంలోని ఆర్థిక రాజకీయ విషయాల మీద వీరి అవగాహన కూడా పొరపాటు అవగాహనే ఇప్పుడు ఉన్న వ్యవస్థనే అంగీకరిస్తారు. వీరు వ్యవస్థలో మౌలికమైన మార్పులు కోరరు". (పేజీ61) భారత హేతువాద సంఘాన్ని చార్వాక పత్రికను ప్రస్తావించిన తరువాత వ్రాయబడిన వాక్యాలు ఇవి. హేతువాద సంఘాలు రాజకీయఆర్థిక విషయాలపై ప్రత్యక్షంగా తీర్మానాలు చేయటంలేదని అది వారు ఏర్పరచుకున్న నియమమని అంతకుముందే తెలుసుకున్నాం. అలాంటపుడు హేతువాదులు ఇప్పుడున్న వ్యవస్థనే అంగీకరిస్తారని' వ్యవస్థలో మార్పులు కోదరని రంగనాయకమ్మగారికి ఎలా తెల్సింది? హేతువాదులుగా చలామణీ అవుతున్న నవ్యమానవవాదులూ మార్క్సిస్టులూ వ్యవస్థలో మౌలికమైన మార్పుకోరేవారే ? పోనీ వాదనకోసం హ్యూమనిస్టులు మౌలిక మార్పును వాంఛించటంలేదని అంగీకరించినా మరి మార్క్సిస్టుల మాటేమిటి ! ఎందుకు ఈ అసంబద్ధమైన నిందలు. ఇంతకూ విప్లవం కావాలి విప్లవం రావాలని గొంతెత్తి పాడితే వస్తుందా విప్లవం ? సమాజంలో వచ్చే మార్పులు మెలమెల్లగా సాగి ఉధృతమై వేగం పుంజుకొని గొంతి గుణాత్మకమైన మార్పు అంటే విప్లవం వస్తుందని కదా మార్క్సిజం

చెప్పేది? కనుక కొన్ని రంగాలలో విప్లవాత్మకమైన మార్పులకోసం కృషిచేసే వారిని రచనలు చేయడం మాత్రమే విప్లవ కార్యక్రమమా అన్నట్లు ప్రవర్తించే రచయితలు ఇలాంటి ఆరోపణలు చేయడం సబబా? రచయిత బాధ్యతతో వ్రాయవద్దా?

"సామాజిక విషయాలపై (సమాజానికి చెందిన ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విషయాలపై) హేతువాదానికి సరియైన అవగాహనలేదు. ప్రభుత్వ స్వభావం గురించి కూడా సరైన అవగాహనలేదు మత మౌఢ్యాన్ని రక్షించడమే ఈ ప్రభుత్వ స్వభావమని అర్థంచేసుకోలేకపోవడంచేతనే ప్రభుత్వం ప్రజలకేదో మేలుచేస్తుందని హేతువాదం భ్రమపడుతుంది." (పేజీ 62) హేతువాదం అంటే ఒక సమగ్రమైన సిద్ధాంతం (A complete ideology) అని పొరపాటుగా ఊహించుకొని చేసే విమర్శ ఇది. హేతువాదానికి రాజకీయాది విషయాలలో సరియైన అవగాహన లేదన్నారు. అది పొరపాటు. శాస్త్రీయ విధానాన్ని రాజకీయాది విషయాలకు వర్తింపచేయడమే ఆ అవగాహన; అంతే. కాగా మూసపోసినట్లుగా ఒకే రకమయిన పరిష్కార మార్గాన్ని హేతువాదం సూచించదు. హేతువాద సంఘం తీర్మానించదు. ఈ అంశాన్ని రచయిత గమనించకపోవడం శోచనీయం.

"ఈనాడు నాస్తికత్వానికీ, హేతువాదానికీ వేరు వేరు సిద్ధాంతాలుగా ఉండవలసినంత సిద్ధాంతపరమైన తేడా ఏమీలేదు." (పేజీ 62) ఇది హేతువాదం' అనే శీర్షికతో ఉన్న వ్యాసంలోని ముక్తాయింపు. హేతువాదం ఒక సిద్ధాంతం అని రచయితకు ఎవరు చెప్పారో ఎలా తెలిసిందో దురూహ్యం. పాజిటివ్ నాస్తికత్వం (గోరాగారిది) ఒక సిద్ధాంతంగా పేర్కొనవచ్చు ఎన్ని వైరుధ్యాలతో కూడుకొని ఉన్నా. హేతువాదానికి 'సిద్ధాంతం' అనే పదాన్ని అంటగట్టడం అమాయకత్వం అనాలో అజ్ఞానం అనాలో బోధపడకుండా ఉంది. అలాకాక తెలిసే అంటున్నారని భావిస్తే "రామాయణ మంతా విని రాముడికి సీత ఏమవుతుంది?" అని ప్రశ్నించినట్లుగా అవుతుంది ఈ వరస.

# దేవుళ్ళూ, భక్తులూ

దేవుళ్ళూ, భక్తులూ, భగవానులూ భజనపరులూ, అవతారపురుషులూ అంతేవాసులూ, గురువులూ శిష్యులూ వేలసంఖ్యలో వెలసిన "పుణ్యక్షేత్రం" భారతదేశం. భక్తులవల్ల నీకేమి బాధ అనే ప్రశ్న రావచ్చును. భక్తి అంటూ జాడ్యంలో వ్యాప్తి చేస్తుంది. భక్తుడు తాను ముక్తిపొంది ఊరకుండడు. ప్రక్క ఇంటివాణ్ణి, స్నేహితుణ్ణి ఇలా తనకు అందుబాటులో ఉన్న అందరిని భక్తులుగా మార్చాలని తాపత్రయ పడతాడు. నష్టాలు అనేకము. భక్తుడు పరాధీనుడు. తనపై తనకు విశ్వాసముండదు. తన వ్యక్తిత్వాన్ని తాను గౌరవించుకోడు, గురువుకో, దేవునికో ఆత్మార్పణ (Surrender) చేసుకుంటాడు. 'గురుర్విష్ణు, గురుర్బ్రహ్మ...' అనే శ్లోకము చదివి సర్వమును అంటే తన జీవితాన్ని శాసించే వాడు గురువు అనే అభిప్రాయానికి వస్తాడు. దానితో మొదలౌతుంది అతని జీవిత విధానంలో బ్రహ్మాండమైన మార్పు. తనకాలాన్ని, ధనాన్ని, శక్తి యుక్తులను అన్నింటినీ గురువు చెప్పినట్లు, లేక దేవుడు స్ఫురింపచేసినట్లు విని యోగిస్తాడు. గుళ్ళు, గోపురాలు, మఠాలు, మశీదులు, చర్చీలు నిర్మిస్తాడు దాంతో సామాజిక అవసరాలు తీర్చటానికి సామాజిక ఉత్పత్తికి దోహదం చేయ డానికి కావలసిన శక్తిసామర్థ్యాలు, వనరులు వమ్ము అవుతాయి. నిరుపయోగ మౌతాయి, సోమరిపోతులు ఎక్కువౌతారు. పరాన్నభుక్కులు తయారవుతారు

మానవునికి సహజమైన ఆలోచన శక్తిని భక్తుడువాడడు. తనచేమొదట్లో ఎంపిక చేయబడిన గురువు చెప్పినదానిని గ్రుడ్డిగా నమ్ముతాడు. తానొక సాధన మవుతాడు. అలాంటి జీవితమే మోక్ష సాధనకు ఉపకరిస్తుందని విశ్వసిస్తాడు. అంటే మానవునికి ఉండే చైతన్యం, సృజనాశక్తి అతనిలో లోపిస్తాయి.

# మల్లాది సుబ్బమ్మ సాహిత్యం

| | | | |
|---|---|---|---|
| చరిత్ర. | 1. | ఆం.ప్ర. మహిళోద్యమం (1860-1983) | రు: [illegible]5.00 |
| విమర్శనాత్మక | 2. | హైందవం స్త్రీలు | [illegible]5.00 |
| గ్రంథాలు | 3. | ఇస్లాం: స్త్రీలు | 15.00 |
| | 4. | క్రైస్తవం: స్త్రీలు | 12 00 |
| వ్యాస సంపుటాలు | 5. | వనితా లోకం | 12.00 |
| | 6. | మనం: మన సంస్కృతి | 12.00 |
| | 7. | బానిసా కాదు, దేవతా కాదు | 10.00 |
| | 8 | ఏది అశ్లీలం | 12.00 |
| | 9. | వ్యభిచారం ఎవరి నేరం | 15.00 |
| | 10. | బంగారు సంకెళ్ళు | 10 00 |
| | 11. | మహిళా దశాబ్దం | 7.00 |
| | 12. | స్త్రీ విమోచన | 7.50 |
| | 13. | మత ధర్మ శాసనాలు: మహిళలు | 8.00 |
| | 14. | ఓ మహిళా! ముందుకు సాగిపో | 7.00 |
| | 15. | స్త్రీలపై అత్యాచారాలు | 7.00 |
| | 16. | స్త్రీల హక్కులు: సమస్యలు | 6-00 |
| | 17. | SAGA OF WOMEN'S STRUGGLE | 10-00 |
| | 18 | ATROCITIES ON WOMEN | 30-00 |
| సంకలనాలు. | 19. | వివాహం: నేడు రేపు | 20 00 |
| | 20. | మహిళా వికాసం: కృషి, ఉద్యోగం | 15 00 |
| | 21. | అశ్లీలం: అసభ్యత | 15-00 |
| | 22. | వరకట్న విశ్లేషణ | 10 00 |
| | 23. | వివాహం సంతానం కోసమేనా | 10 00 |
| నవలలు | 24. | వంశాకురం | 20-00 |
| | 25. | ప్రేమ + సెక్స్ = నీతి | 17.00 |
| | 26. | కాంతి కిరణాలు | 1[illegible].00 |
| | 27. | వెలిగిన జ్యోతి | [illegible]00 |
| | 28. | చీకటి వెలుగులు | 10.00 |
| | 29. | ఈ దేశం నాదేనా | 5.00 |
| కథలు | 30. | మాతృత్వానికి మరోముడి | 20.00 |
| ESSAYS. | 31. | WOMEN, TRADITION & CULTURE | 70-00 |
| CRITIQUE. | 32. | ISLAM & WOMEN | 120.00 |
| | 33 | HINDUISM & WOMEN | 250.00 |